**CHETANA** (TELUGU) BY DR. G. ARUNA MOHAN

BASED ON AUTHOR'S THESIS TITLED 'A STUDY OF PSYCHOLOGICAL AND EDUCATIONAL IMPLICATIONS OF J. KRISHNA MURTI'S OBSERVATIONS OF LIFE AND RELATION SHIP', SUBMITTED TO NAGARJUNA UNIVERSITY, IN 1990, FOR THE DEGREE OF DOCTOR OF PHILOSOPHY (EDUCATION).

PUBLISHED BY THE AUTHOR

**WITH THE FINANCIAL GRANT BY TIRUMALA TIRUPATI DEVASTANAMS, TIRUPATI, UNDER 'AID TO THE AUTHORS SCHEME'**

FIRST EDITION JUNE 1996. 1000 COPIES

BRONGE RELIEF ON COVER BY SRI. C.S.N. PATNAIK

COVER DESIGNED BY DR. L. VIJAYA MOHAN REDDY

COVER PRINTED BY SUPRINT AD MEDIA, GUNTUR

LASER TYPE SETTING BY ANU GRAPHICS, GUNTUR

TEXT PRINTED BY SRI LAKSHMI PRESS, GUNTUR

PRICE : RS. 25/-

FOR COPIES :

PALLAVI PUBLICATIONS, KARL MARX ROAD, VIJAYAWADA - 520 002

NAVODAYA PUBLISHERS, KARL MARX ROAD, VIJAYAWADA - 520 002

NOVODAYA PUBLISHERS, 5TH LANE, ARUNDELPET, GUNTUR-522 001

' నీవే ఈ ప్రపంచం

చేతనలోని అంశాలే చేతన

సత్యమొక పథ రహిత సీమ

ప్రత్యేక మైన పద్ధతిని బోధించే ఒక సంస్థ, మతం, సిద్ధాంతం, గురువు, ఆచారం లేక ఏ తాత్విక జ్ఞానమో, మానసిక తంత్రమో మనిషిని ఆ సీమ దరికి చేర్చలేవు. దానిని అతడు పరస్పర సంబంధమనే అద్దంలో కనుగొన వలసిందే. తన చేతన లోని విషయ సామాగ్రిని పరిశీలన అనే వెలుగులో ప్రత్యక్షంగా చూసికొని అర్థం చేసుకొనవలసినదే కాని బౌద్ధికమైన విశ్లేషణతోనూ, అంతరంగాన్ని విభజించి జరిపే శోధనతోనూ కాదు '

# ఈ పుస్తకం గురించి

ఈ రచయిత్రి కృష్ణమూర్తి ప్రవచించిన విషయాలను అభ్యసించటానికి చేసిన పరిశోధనా ఫలితంగా సిద్ధాంత వ్యాసం వ్రాయటం జరిగింది. జీవిత రంగాన్ని పరిశోధిస్తూ వారు మన కందించిన మానవుని మానసిక పోకడలను తన సిద్ధాంత వ్యాసాన్ని అనుసరించి తెలుగులో వ్రాసి పాఠకులకు దగ్గరగా తీసికెళ్ళాలన్న ప్రయత్నమే యీ పుస్తక రూపం. కృష్ణమూర్తి బహు సులభమైన ఆంగ్లభాషలో సంభాషించేవారు. వారి ఉపన్యాసాలూ, శాస్త్రజ్ఞులతో, ఉపాధ్యాయులతో, విద్యార్థులతో, పలు రంగాలకు సంబంధించిన మేధావులతో వారు జరిపిన చర్చలు పుస్తక రూపాలు దిద్దుకున్నాయి.

ఆంగ్లంలో కృష్ణమూర్తి తత్వాన్ని ఎందరో పెద్దలు అనుభవజ్ఞులు పరిచయం జేస్తూ వస్తున్నారు. తెలుగులోనూ శ్రీమతి కనకదుర్గా రామచంద్రన్ గారు, శ్రీ లక్ష్మీ ప్రసాదు గారు, శ్రీ రఘుపతిరావుగారు, శ్రీ కె.కె. రామానుజాచార్యులు గారు, విరించిగారు కృష్ణమూర్తి ఉపన్యాసాల నసువ దించటం, తాముగా ఆయన తత్వాన్ని వ్రాయటం జరిగాయి. ఆపై 'కృష్ణమూర్తి ఫౌండేషన్, ఇండియా'వారి ఆధ్వర్యంలో వీరి పుస్తకాలు దక్షిణాది భాషలలోనికి అనువాదం చేయటమూ జరుగుతున్నది. ఇప్పటికి శ్రీ హనుమంతరావుగారు, శ్రీమతి సరోజినీ ప్రేమ్‌చంద్ గారు, విరించి గార్లు అనువదించిన పుస్తకాలు తెలుగు పాఠకుని కోసం వచ్చాయి.

పెక్కురు గ్రంధకర్తలిలా కృష్ణమూర్తి ప్రవచించిన విషయాలను ప్రస్తావించుతూ రచనలు చేస్తున్నారు. ఈ రచయిత్రికి విద్యా మనస్తత్వ శాస్త్ర పఠన బోధనాసక్తులుండటం వలన యీ పుస్తకంలో వారి ప్రవచనాలలోని మానసిక తత్వాన్ని వెల్లడి జేసే విషయాలను గ్రహించి మానవుని మానసిక నిర్వహణా రీతులను వ్యక్తీకరింప తలపెట్టడమైనది.

కేవలం అవగాహనా సౌలభ్యం కోసం విషయాన్ని ఐదు భాగాలుగా విభజించడం జరిగింది.

"ద్రష్ట" అంటే చూచేవాడు. శరీరం మనస్సు కలసి పనిచేయడం వలన చూడటం జరుగుతుంది. శరీరంలో ముఖ్యభాగమైన ' మెదడు' నిర్వహించే పాత్రను, మెదడుతో కలసి మనస్సు పనిజేస్తుండటం వలన పలుస్థాయిల్లో 'చేతన' కూడే రీతులను ప్రధమ భాగంలో పొందు పరచటమైనది.

"దృష్టి" అన్న ఉపశీర్షిక క్రింద మనస్సు ఏ విధంగా ఏర్పడేది, జ్ఞానం, జ్ఞాపకం, పలు రకాల ఆలోచనలు, మానసిక కాలం ఎలా ఏర్పడేది. మనిషి ఎలా ఒంటరి వాడయ్యేది, సన్నిహితంగావటానికెలా ప్రయత్నించేది, కోరికతో ఆశలతో ఎలా నిబద్ధ

డయ్యేదీ, ప్రేరణకు లోనయ్యేది, వైఖరుల నేర్పరుచుకునేది, పోల్చిపోటీబడేది, అధికారాన్ని ప్రదర్శించేది, భద్రతనాశించేది, ఏదోఒకదానితో ఎలా తాదాత్మ్యమందేదీ, విలువల నేర్పరచుకునేదీ, అంగీకారాన్ని విముఖతను చూపేది., ఒక పద్ధతిననుసరించి సమస్యను విశ్లేషిస్తూ పరిష్కరింప యత్నించేది ఇవన్నీ ఆలోచనలకు వివిధ రూపాలేనన్నది వివరింప బడింది.

'ఘర్షణ' అన్న ఉప శీర్షికలో తానున్న స్థితికి, ఉండాలకున్న స్థితికి మధ్య గల సంఘర్షణకు పర్యవసానంగా హింస, కోపం, అసూయ, క్రూరత్వం, భయం దు:ఖం అన్న అంశాలున్నాయి.

'వికాసము' అన్న శీర్షిక క్రింద ప్రశ్నించడం, విచారణజేయడం, అవధానత యొక్క ప్రాధాన్యత, ప్రత్యక్షజ్ఞానం పొందటం, ఎరుకకలగడం, పరిశీలించడం, వినడం, అభ్య సించడమనే కళలు, అంతర్దృష్టి గలగడం, మానసిక మరణం, ధ్యానం వివరింప బడ్డాయి.

'దర్శనము'! అన్న ఉప శీర్షిక క్రింద మానసిక స్వేచ్ఛ, సున్నితంగా ఉండటం, ప్రజ్ఞ ప్రేమల వెలుగు, సృజనాత్మకత, సమగ్రత, సహృదయత, సౌందర్యము, సత్య దర్శనము పొందుపరచబడ్డాయి.

ఈ ప్రయత్నంలో -

భాషకు, భావానికీ మెరుగులు దిద్దిన మా సీ.హెచ్. కృష్ణమూర్తి గారికి,

ప్రచురణకు ప్రోత్సహించిన శ్రీ రఘుపతిరావు గారికి, శ్రీ మధురాంతకం రాజారాం గారికి,

స్క్రిప్టు చదివి సూచనలు చేసిన శ్రీమతి వసంత కుమారి గారికి, శ్రీమతి సరోజినీ ప్రేమచంద్ గారికి, శ్రీ యం.యస్. కృష్ణ ప్రసాదు గారికీ, భాష గురించి హెచ్చరించిన శ్రీ వి. నారాయణమూర్తి గారికి,

ప్రేమతో సహకరించిన మిత్రులు శ్రీమతి లలిత, శ్రీ రాజశేఖర్, కుమారి శ్యామ సుందరి, శ్రీమతి ఆదిలక్ష్మి గార్లకు,

జిడ్డు కృష్ణమూర్తి కాంస్య శిల్పాన్ని కవరుపై ముద్రణకు దయతో అంగీకరించిన శిల్పి శ్రీ సి.యస్.యన్. పట్నాయక్ గారికి, కవరుపేజి డిజైన్ చేసి ఇచ్చిన డా॥ యల్. విజయమోహన రెడ్డిగారికి,

పుస్తక ప్రచురణకు ఆర్థిక సహాయము చేసిన తిరుమల తిరుపతి దేవస్థానం వారికి

- నా హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు.

# విషయసూచిక

# పరిచయము

ఈ భూమండలంలో మూడువంతుల నీరు ఒక వంతు నేలా ఉన్నాయి. ఆ నేలపైన మనుష్యులు జీవించేది కొంత భాగంలోనే! అట్టి భూగోళాన్ని యీ అనంత విశ్వంలో పెద్దదనటమూ సమంజసంగాదు. ఈ భూమిపైన మనిషి ఒక్కడే లేడు. కొండలు, అడవులు, జంతువులూ - జీవ నిర్జీవ పదార్థాలెన్నో! ఈ భూతలం పలు దేశాలుగా, రాష్ట్రాలుగా, పట్టణాలుగా, వీధులుగ విభజింప బడింది. మనిషి సంఘజీవి. ఈ సంఘంలో కుటుంబానికి ఓ యిల్లూ, సమూహానికో మతం, తత్త్వం, సంఘానికి ఓ ప్రభుత్వం ఉన్నాయి. అలాగే ఉపాధ్యాయుల నుండీ పుస్తకాల నుండీ నేర్చుకోవటానికి పాఠశాల ఉన్నది. మానవజాతి చరిత్ర చూస్తే మనిషి తనను తాను అర్థంజేసుకొవాలన్న ప్రయత్నమెంతో కన్పిస్తుంది. మానవ జాతి ఆవిర్భావం గురించి మతం యిచ్చిన వివరణలతోగానీ, ప్రయోగశాలలలో తాము కనుగొన్న విషయాలతోగానీ, వాటిపై పలురకాలైన విశ్లేషణలతోగానీ తృప్తిపడక మనిషి అప్పటి నుండి ఇప్పటి వరకూ అన్వేషిస్తూనే ఉన్నాడు.

ఆదిమ మానవుడు ప్రకృతిలో ఒక భాగంగా జీవించాడు. దాని వైపరీత్యాలకు భయపడ్డాడు. ప్రకృతిని పూజించాడు. చెట్లు, జంతువులు, నక్షత్రాలు, మానవులు మొదలైన వాటిగురించి తెలుసుకున్నాడు. నేటి మానవుడు తనతోటి వానిపైనా, ప్రకృతిపైనా ఆధిపత్యం సాధించాలని గూడా ప్రయత్నిస్తున్నాడు. ఎన్నో కష్టనష్టాల కోర్చి ఏర్పరచుకున్న ప్రయోగశాలల్లో చేసే కఠోర పరిశోధనలపైన, తానెంత వరకూ ఆధార పడవచ్చునన్నదీ, ఎవరిపైన వేటిపైన తాను ఎంత ఆధిక్యతను సంపాదించానన్న అంచనా గూడా వున్నది. అంతేగాక తాను సంపాదించిన జ్ఞానం తననెంత వరకూ రక్షింపగలదో నన్న శంక గూడా మరో ప్రక్క ఉన్నది. అంతకు మించి తాను సంపాదించిన అపరి మితమైన విజ్ఞానానికి, శక్తులకు ఉన్న ప్రమాదకరమైన పరిమితులెన్నింటినో గురించి గూడా ఒక వంక భయపడు తున్నాడు. మరొక వంక యాంత్రికమై పోతున్న జీవితంలో మానవ సంబంధాలెంత కుంటుపడుతున్నదీ జీవితమెంత నికృష్టమయి పోతున్నదీ గ్రహించి మానవతను పెంపొందించాలని గూడా ప్రయత్నిస్తున్నాడు. అశాంతి నుండి బయటపడటానికి అవసరమయితే తిరిగి ఒక గురువునుగానీ, భగవంతునిగానీ, మతాన్ని గానీ ఆశ్రయిస్తున్నాడు.

ఎన్ని ప్రయత్నాలు జేసినా అంతర్గత బాహ్య సంఘర్షణల మూలంగా మానవ సంక్షేమం నానాటికీ బహు క్లిష్టమై పోతున్నది. సాంకేతికాభివృద్ధి రూపేణా లభించిన వాటి నన్నింటినీ నేటి మానవుడు అనుభవిస్తున్నాడుగానీ తానే తయారుజేసిన ఒక అణుబాంబుతో మానవజాతి మొత్తం అంతమయ్యే స్థితికి వస్తుందేమోనని గూడా భయపడుతున్నాడు. పాఠశాలగానీ, ఉపాధ్యాయుడుగానీ, విద్యార్థిగానీ ఎవరూ యీ రకమైన వ్యవస్థకు దూరం గాలేరు.

జీవితం ఒక నది వంటిది. నిరంతరం కదలిపోతూ, అన్వేషిస్తూ, పరిశోధిస్తూ ముందుకు త్రోసుకుని పోతూంటుంది. కాని మనసు నదిలా ఉండటానికి ఇష్టపడదు. స్థిరత్వం, శాశ్వతత్త్వం లేకుండా భద్రతా లేమితో జీవించటం మనసుకు ప్రమాదకర మనిపిస్తుంది. అందుకే తన చుట్టూ సాంప్రదాయమనే గోడనో, సాంఘిక రాజకీయ సిద్ధాంతమనే గోడనో, కుటుంబ ప్రతిష్ట, ఆస్తిపాస్తులనే గోడనో ఏర్పరచుకుంటుంది. కాని జీవితం మాత్రం కదలి పోతూ ఉంటుంది. జీవితమంటె మనిషికి ప్రకృతితోనూ, తనతోటి వారితోనూ ఉన్న సంబంధాలే' నంటారు కృష్ణమూర్తి. సుఖదుఃఖాలు, సౌకర్యాలు, సంఘర్షణలు, అసూయా ద్వేషాలు, యుద్ధాలు, హింసల మయమీ సంఘం. మనిషి ఇలాంటి సంఘాన్ని రూపొందించటానికి కారణం అతడు చేసే ఆలోచనే నంటారు కృష్ణమూర్తి. లోతుగా పరిశీలిస్తే ఆలోచన మనిషినెంత క్షోభ పెట్టి మానవ జీవితంలో ఎంత కీలకమైన పాత్ర నిర్వహిస్తున్నదో తెలుస్తుంది. మనిషి చేసే ఆలోచన ఆటోమొబైల్‌ను, వైర్‌లెస్‌ను కనిపెట్టి మనిషిని మనిషికి దగ్గర జేసింది. అదే ఆలోచన అసూయగా, కోపంగా, హింసగా మారి మానవ జీవితంలో ఎంతో ప్రమాదకరమైన పాత్ర వహించింది. మనిషిని మనిషికి దూరం జేస్తున్నది. మనిషి కున్న ఆలోచనా శక్తి సాంకేతికంగా ఉపకయోగకరమే అయినా, మనిషి ఉనికికే ప్రమాదకారిగా పరిణమిస్తున్నది.

అంతేగాక ఆలోచన జరిగిపోయిన వాటి గురించి, జరుగబోవు వాటి గురించీ చింతిస్తూ, చర్చిస్తూ, వాదిస్తూ, కపటంగా తన సౌఖ్యం కోసం ఎన్నో సంకెళ్ళను తయారు జేస్తుంది. మనుష్యుల్ని జాతులుగా, వర్గాలుగా, దేశీయులుగా మరెన్నో రకాలుగా విభజిస్తుంది. సమస్యలను సృష్టిస్తుంది. కాని మనిషి బాహ్యంగా కన్పించే పురోభివృద్ధిని జూసి ఆలోచనకే పెద్ద పీట వేసి దాని స్థానాన్ని శంకించటానికి వీలు లేదన్నట్లు తలుస్తున్నాడు.

ఈ ఆలోచనను మతంగూడా పదే పదే గర్హించింది. కాని కేవలం నమ్మకంతో, భయంతో అలా జేసింది. కొందరు ఆలోచనను సంస్కరించమని ఎన్నో పరిష్కార మార్గాలు, సూత్రాలు, సిద్ధాంతాలు ప్రతిపాదించారు. మరికొందరు అణచివేయమన్నారు. కాని కృష్ణమూర్తి మాత్రం ఆలోచనను అణచివేయటం వలన, సంస్కరించటం వలన సమస్య పరిష్కారమవదనీ, ఆలోచనలోని సత్యాసత్యాలను జూసినప్పుడు ఆలోచన అంతమవుతుందనీ అంటారు.

ఎందరో మహాత్ములు సత్యాన్ని దర్శించదలచినప్పుడు, కోరికలను అరికట్టుకోమనీ, ఇంద్రియాలను నిగ్రహించుకోమనీ ప్రధానంగా సూచించారు. ఇంద్రియానుభవాలను, మెదడు నిర్వహించే పాత్రను, కోరిక పుట్టుకను సమూలంగా గ్రహించిన కృష్ణమూర్తి దేనినీ నిగ్రహించుకోమని చెప్పరు. ఆకలిగా నున్నప్పుడు తినాలన్న కోరిక ఉండటం సహజమంటారు. ఆశలు, అత్యాశలు కోరికనెలా సమస్యాత్మకం జేస్తాయో చూపుతారు. పాక్షికంగా పనిజేసే ఇంద్రియాలుగాక, కేవలం ఏఒక్క ఇంద్రియపు ఆధిక్యతతోనో పనిజేస్తూ గ్రహించటం గాక ఇంద్రియాలన్నీ ఐక్యతతో పనిజేస్తున్నప్పుడు, ఏ ఉద్వేగ పూరితమైన కోరికలూ లేనప్పుడు దేహానికెంతో ప్రజ్ఞ ఉంటుందని, అది సంపూర్ణ ప్రజ్ఞతో ఏకమై ఉంటుందని, అట్టి ప్రజ్ఞలో మనిషి సంపూర్ణ శక్తితో పని జేస్తాడనీ అంటారు. ఇంద్రియాలు గూడా చైతన్యంలో ఒక్కటై ఉండే ఏకతాను భవాన్ని చూపుతారు.

కృష్ణమూర్తి మానవ సమస్యకు పరిష్కారం సంపూర్ణ మానసిక స్వేచ్ఛలోనే ఉందంటారు. మానసిక జీవితాన్ని గురించిన ఎరుక గలిగినప్పుడు మానసిక స్వేచ్ఛ సాధ్యమేనంటారు. అనాదిగా మనిషి జీవితాన్ని, మరణాన్ని, ఆవలనున్న దానిని దైవమనో, సత్యమనో, శక్తి అనో అంటూ దానికోసం అన్వేషిస్తూనే ఉన్నాడు. కాల చక్రానికతీతంగా ఏదైనా స్థితి ఉన్నదో లేదో కనుగొనాలనుకున్న వారు ముందుగా తమ లోక వ్యవహారాల నుండి స్వేచ్ఛను పొందాలి. అంటే ఎవరో చెప్పినదానికి, అందరూ చెప్పే దానికి తలవొంచక స్వతంత్రుడై తనకుతానుగా ఏకాంతునిగా నిలబడాలి.

మనిషి సాధారణంగా దుఃఖాన్నుండి విముక్తి పొందాలనుకుంటాడు. ఏ కోరికైనా బంధమే - ముక్తి పొందాలనుకోవటం గూడా స్వేచ్ఛంటే భయంగానీ, బలవంతంగానీ, తన భద్రత గురించి ఆదుర్దాగానీ లేని ఒక విధమైన మానసిక స్థితి. తానున్న స్థితి నుండి వేరొక విధంగా మారిపోవటానికి ప్రయత్నించడంలోగానీ, ఏమి చేయాలని

బుద్ధి పుడితే అది చేయటంలోగానీ, సాంప్రదాయం, తల్లిదండ్రులు, గురువు చెప్పినదానిని ఆచరించటంలో గానీ స్వేచ్ఛ లేదు. క్షణక్షణం ఎవరికి వారు ఉన్నదున్నట్లుగ అర్థం జేసుకోవటంలో స్వేచ్ఛ ఉన్నది. ఎవరి స్థితిని వారర్థం జేసుకోవ టంలో మార్పు వస్తుంది అంటారు కృష్ణమూర్తి.

విజ్ఞానశాస్త్రం శాఖోపశాఖలై విస్తరించటంలో శాస్త్రీయ దృక్పథంతో శాస్త్ర విషయాలను ప్రతి శాఖలోనూ యధాతథంగా గ్రహిస్తున్న శాస్త్రజ్ఞుడు గూడా తన జీవితంలో మాత్రం వాస్తవాలకు స్పందించలేక, తన గురించి తాను తెలుసుకోవ టంలో యదార్థానికి దగ్గర కాలేకపోతున్నాడు. శాస్త్రీయమైన మనసు, ధార్మికమైన మనసు ఒక్కటే, వేరు గావు' అంటారు కృష్ణమూర్తి. శాస్త్రజ్ఞుడెలా భౌతికమైన యదార్థాలను వరుసగా చూస్తూ గ్రహిస్తుంటాడో అలాగే తన మనసులోనున్న ఆలోచనలను, భావోద్వేగాలను ఒకదాని నుండి మరొక దానిలోనికి పోవటాన్ని, అంతటినీ శాస్త్రీయంగా చూస్తూ పోవాలంటారు. ఆత్మజ్ఞానం యితరులు కలిగించేది గాదు తనను తాను యితరులతో గల పరస్పర సంబంధమనే అద్దంలో చూసుకున్నట్లయితే చూచిన దానిని నిందించకుండా, మరొకరితో పోల్చు కోకుండా, ఇంకా బాగా ఉండాలనుకోకుండా, ధర్మమూర్తులమనిపించుకోవాలను కోకుండా తన యదార్థ స్వరూపాన్ని చూసుకుంటూ పోతే ఆ అనంత ప్రయాణంలో తన అంతరంగంలోనే సత్యాన్ని దర్శింపగలడు.

కృష్ణమూర్తి ప్రతి ఒక్కరిలోనూ ప్రపంచమంతా యిమిడి ఉన్నదని. "నీవే ప్రపంచం" అంటూ మానవులలోని సామ్యతను చూపుతారు. మానవాళికి నేటి మానవుడు ఏమి సమకూర్చుతున్నాడో చూడబోతే భౌతిక సాంకేతిక రంగాలలో జీవితాన్నెంతో సౌకర్యవంతమూ, అత్యద్భుతమూ గావిస్తున్న పురోభివృద్ధి ఒక ప్రక్క కన్పిస్తున్నది. మరొక వంక రకరకాలుగా కుటుంబాన్నుండి ప్రపంచ దేశాల వరకూ విద్వేషాగ్నులు, హింసాయుత మార్గాన్వేషణలూ, ఆందోళన, మానసిక వైకల్యం ప్రబలిపోతున్న నేపథ్యంలో ఇంతటి భౌతికాభివృద్ధి మానసిక వినాశనానికి, మానసిక దౌర్బల్యానికి - ఇవన్నీ ప్రతిబింబించే సాంఘిక హైన్యతకూ మాత్రమే దోహదం జేస్తున్నట్లు కన్పిస్తున్నది. కృష్ణమూర్తి ప్రతి మనిషీ స్వస్వరూప జ్ఞానాన్ని అశ్రద్ధ జేయటం వలన యీ అస్తవ్యస్తత ఏర్పడుతున్నదంటారు. మనిషి జీవితాన్ని నటనా పూర్వకం జేసుకుంటున్నాడు. మనిషి నిజ స్వభావాన్ని యీ నటన కప్పివేయటం వలన మానవ సంబంధాలు కుంటుబడుతున్నాయి. కనుక మనిషి గురించిన యదార్థ మేమిటి?

కృష్ణమూర్తి కాలాన్ని రెండు రూపాల్లో చూస్తారు. ఒకటి భౌతిక కాలం. అంటే రెండు భౌతిక సంఘటనల మధ్య నున్న గడియారపు కాలం. మానసిక కాలం రెండవది, అంటే మనమిప్పుడున్న, యీ క్షణంలో వున్న స్థితికీ మనము ఉండాలను కుంటున్న స్థితికీ మధ్యనున్న కాలం. మనిషి భూతకాలానికి చెందిన ఆలోచనలపైన, జ్ఞాపకాలపైన ఆధారపడి వర్తమానంలో జీవిస్తుంటాడు. అందువలన వర్తమానపు సన్నివేశాలకు నూతనానుభూతితో స్పందించలేకపోతాడు. తాను భవిష్యత్తులోకి చూస్తున్నా గూడా వర్తమానంలో జీవించలేడు. అంటే మనిషి మానసికంగా నశించిన భూతకాలానికి గాని ఊహాజనితమైన భవిష్యత్తుకు గాని ప్రతినిధి అవుతున్నాడు. ఈ విధంగా ఆలోచన మానసిక కాలాన్ని సృష్టిస్తున్నదని, ఒక్కమాటలో చెప్పాలంటే ఆలోచనే మానసిక కాలమని అంటారాయన.

మానసిక కాలాన్ని సృష్టిస్తూ దానికి బందీ అవుతూ నిబద్ధితమైన ఇంద్రియాలు, మెదడు నిర్వహించే కార్యకలాపాలకు కట్టుబడి జేస్తున్న పలురకాలైన ఆలోచనలు, దాని ఫలితాలు అన్నీ చేతనను కూర్చుతాయి. సంపూర్ణ అవధానతతో అంతరంగాన్ని క్షణం క్షణం నిర్ద్వంద్వంగా పరిశీలించు కోవడంలో ప్రత్యక్ష జ్ఞానాన్ని పొందుతూ అజ్ఞానాన్ని ప్రోగుజేసుకోకుండా ప్రతి క్షణం నిత్య నూతనంగా జీవితాన్ని దర్శించ గలిగేది, పూర్ణ శక్తితో చైతన్య వంతమయేది మనసుకూర్చుకుంటూ వచ్చిన వాటి నన్నింటిని నిర్ద్వంద్వ ఆత్మపరిశీలనలో జారిపోనిచ్చినపుడే.

కృష్ణమూర్తి మానవ జీవితంలో ఆలోచన ఎంతవరకు ఏస్థాయిలో అవసరమో చూసి, అవసరం లేని చోట ఆటంకంగానున్న చోట దానినంతం జేయమంటారు.

## కృష్ణమూర్తి జీవితము

**జననం :** కృష్ణమూర్తి చిత్తూరు జిల్లాలోని మదనపల్లెలో 1895వ సంవత్సరంలో మే 11వ తేదీన జిడ్డు నారాయణయ్య, సంజీవమ్మ గార్లకు జన్మించారు. ఎనిమిదవ బిడ్డగ పుట్టినందువలన హిందూ సాంప్రదాయం ప్రకారం ఎనిమిదవ సంతానానికి శ్రీకృష్ణుని పేరు పెట్టే ఆనవాయితీ ఉన్నందువలన కృష్ణమూర్తి అని నామకరణం జరిగింది. నారాయణగారు ఒక పేరు పొందిన జ్యోతిష్కునితో జాతకచక్రం వేయించగా కృష్ణమూర్తి ఒక మహానుభావుడవుతాడని చెప్పారు. ముందుగా కృష్ణమూర్తి తల్లి సంజీవమ్మ గారు తన ఎనిమిదవ సంతానం ఒక ప్రత్యేకమైనదన్న గాఢ నమ్మకంతో ఆ బిడ్డ

కృష్ణమూర్తి కాలాన్ని రెండు రూపాల్లో చూస్తారు. ఒకటి భౌతిక కాలం. అంటే రెండు భౌతిక సంఘటనల మధ్య నున్న గడియారపు కాలం. మానసిక కాలం రెండవది, అంటే మనమిప్పుడున్న, యీ క్షణంలో వున్న స్థితికీ మనము ఉండాలను కుంటున్న స్థితికీ మధ్యనున్న కాలం. మనిషి భూతకాలానికి చెందిన ఆలోచనలపైన, జ్ఞాపకాలపైన ఆధారపడి వర్తమానంలో జీవిస్తుంటాడు. అందువలన వర్తమానపు సన్నివేశాలకు నూతనానుభూతితో స్పందించలేకపోతాడు. తాను భవిష్యత్తులోకి చూస్తున్నా గూడా వర్తమానంలో జీవించలేడు. అంటే మనిషి మానసికంగా నశించిన భూతకాలానికి గాని ఊహాజనితమైన భవిష్యత్తుకు గాని ప్రతినిధి అవుతున్నాడు. ఈ విధంగా ఆలోచన మానసిక కాలాన్ని సృష్టిస్తున్నదని, ఒక్కమాటలో చెప్పాలంటే ఆలోచనే మానసిక కాలమని అంటారాయన.

మానసిక కాలాన్ని సృష్టిస్తూ దానికి బందీ అవుతూ నిబద్ధితమైన ఇంద్రియాలు, మెదడు నిర్వహించే కార్యకలాపాలకు కట్టుబడి జేస్తున్న పలురకాలైన ఆలోచనలు, దాని ఫలితాలు అన్నీ చేతనను కూర్చుతాయి. సంపూర్ణ అవధానతతో అంతరంగాన్ని క్షణం క్షణం నిర్ద్వంద్వంగా పరిశీలించు కోవడంలో ప్రత్యక్ష జ్ఞానాన్ని పొందుతూ అజ్ఞానాన్ని ప్రోగుజేసుకోకుండా ప్రతి క్షణం నిత్య నూతనంగా జీవితాన్ని దర్శించ గలిగేది, పూర్ణ శక్తితో చైతన్య వంతమయేది మనసుకూర్చుకుంటూ వచ్చిన వాటి నన్నింటిని నిర్ద్వంద్వ ఆత్మపరిశీలనలో జారిపోనిచ్చినపుడే.

కృష్ణమూర్తి మానవ జీవితంలో ఆలోచన ఎంతవరకు ఏస్థాయిలో అవసరమో చూసి, అవసరం లేని చోట ఆటంకంగానున్న చోట దానినంతం జేయమంటారు.

## కృష్ణమూర్తి జీవితము

**జననం :** కృష్ణమూర్తి చిత్తూరు జిల్లాలోని మదనపల్లెలో 1895వ సంవత్సరంలో మే 11వ తేదీన జిడ్డు నారాయణయ్య, సంజీవమ్మ గార్లకు జన్మించారు. ఎనిమిదవ బిడ్డగ పుట్టినందువలన హిందూ సాంప్రదాయం ప్రకారం ఎనిమిదవ సంతానానికి శ్రీకృష్ణుని పేరు పెట్టే ఆనవాయితీ ఉన్నందువలన కృష్ణమూర్తి అని నామకరణం జరిగింది. నారాయణగారు ఒక పేరు పొందిన జ్యోతిష్కునితో జాతకచక్రం వేయించగా కృష్ణమూర్తి ఒక మహానుభావుడవుతాడని చెప్పారు. ముందుగా కృష్ణమూర్తి తల్లి సంజీవమ్మ గారు తన ఎనిమిదవ సంతానం ఒక ప్రత్యేకమైనదన్న గాఢ నమ్మకంతో ఆ బిడ్డ

కృష్ణమూర్తి గురించి, ఆయన తమ్ముడు నిత్యానందుని గురించి విని తృప్తి పడిన శ్రీమతి అనిబిసెంట్ వీరిరువురిని తన మాతృత్వ పరిష్వంగం లోనికాహ్వానించారు. చనిపోయే వరకూ ఆ మాతృభావనను విడనాడలేదు. దివ్యజ్ఞాన సమాజంలోతాను సృష్టించదలచిన విశ్వగురు పీఠానికి కృష్ణమూర్తి తగిన వారని తలంచారు. అందుకే తండ్రి నారాయణయ్య గారి అంగీకారంతో కృష్ణమూర్తిని నిత్యానందుని దివ్యజ్ఞాన సమాజ హస్తాలలోనికి తీసుకున్నారు.

**దివ్యజ్ఞాన సమాజ (టి.ఎస్) లక్ష్యాలు :**

జాతి, లింగ, కుల, వర్గభేదాలు లేని విశ్వమానవ సౌభ్రాతృత్వానికి కేంద్రమగుట

మత, తాత్విక, విజ్ఞాన శాస్త్రాలను పోల్చి పఠించుటను ప్రోత్సహించుట.

అనావిష్కృత ప్రకృతి సూత్రాలను, మానవుని నిగూఢ శక్తులను పరిశీలించుట.

**దివ్యజ్ఞాన సమాజంలో - కృష్ణమూర్తి :** సరైన ఆహారం, సాధనల వలన త్వరలోనే కృష్ణమూర్తి నిత్యానందుల ఆరోగ్యంలో ఆనందంలో చెప్పుకోదగినంత మార్పు వచ్చింది. వీరురివురికి డిక్క్లేర్క్, సుబ్రమణ్య అయ్యర్, అర్నెస్ట్ ఉడ్, డాన్, ఎఫ్. రస్పోలీ పాఠాలు చెప్పేవారు. లేడ్‌బీటర్ గారు తాను స్వయంగా చరిత్ర పాఠాలు బోధించటమే గాక వ్యకిగత శ్రద్ధతో కృష్ణమూర్తిని సూక్ష్మశరీరంతో మైత్రేయదేవుని వద్దకు తీసుకెళ్తూండేవారట. మైత్రేయదేవుని దర్శన విశేషాలే కృష్ణమూర్తి తొలుత వ్రాసిన 'గురుపాదాల చెంత' అనే చిన్న పుస్తకం. ఈ ఆంగ్ల పుస్తకంలో స్పెల్లింగులు, ఫుల్‌స్టాప్‌ల వంటి గుర్తులుంచటంలో మాత్రం లేడ్ బీటరుగారి సహాయమున్నదట. చిరుతప్రాయంలోనే రచించిన యీ పుస్తకాన్ని 27 భాషలలోనికి తర్జుమా చేసి 40కి పైగా ప్రచురణలు చేశారు. ఇంకనూ ప్రింటులోనున్న పుస్తకమిది ! లెడ్‌బీటరు గారు శిక్షణా కాలం తర్వాత కృష్ణమూర్తిని మార్మిక జీవితంలోనికి ప్రవేశపెట్టారు. ఈ మార్మిక జీవితానికి సంపూర్ణ ఆరోగ్యము, శారీరక,మానసిక పవిత్రత, నిస్వార్ధమైన ఆశయము, సర్వభూతములయందు కరుణ, దయ, సత్యవర్తనము, క్లిష్టపరిస్థితుల్లో సైతం మొక్కవోని ధైర్యము, తగనిచోట సున్నితంగా విభేదించటము, నిరంతరము మారే ప్రపంచాన్ని తగినట్లుగ అభినందించటము తప్పనిసరి.

**15వ ఏటనే చెప్పిన కృష్ణమూర్తి మొదటి పాఠాలు :** అనిబిసెంట్‌తో కృష్ణమూర్తి బెనారస్ వెళ్ళినపుడు అక్కడి సభలో కృష్ణమూర్తి బోధలు మొదలయ్యాయి. సెంట్రల్

హిందూకళాశాల ప్రిన్సిపాల్ జార్జి అరండల్, ప్రిపరేటరీ స్కూల్ ప్రాథమిక ఉపాధ్యాయులు, విశ్వవిద్యాలయ ఆంగ్లఆచార్యులైన ఎ.యి.ఓడ్ హౌస్ వారి శిష్యులు. విద్యావంతులైన వీరందరూ తామెప్పుడూ యింత మంచి బోధనలు వినలేదని, తమనీ బోధలు ఎన్నడూ లేనంతగా ఉత్తేజపరచాయని చెప్పారు.

కవిగా బహుమతి గ్రహించిన ఓడ్‌హౌస్ కృష్ణమూర్తి సహజంగా, పవిత్రంగా, దయతో, నిస్వార్థంగా, పెద్దలను మన్నిస్తూ, దగ్గరివారితో ఎంతో వాత్సల్యంతో ఉంటారని చెప్పారు. తాను ప్రత్యేకత గల్గిన వాడినని గాని, స్వాభిమానంతో గాని కృష్ణమూర్తి ఎన్నడూ కనిపించలేదని వ్రాశారు.

**విద్యాభ్యాసము** : నారాయణయ్య గారు దివ్యజ్ఞాన సమాజంలో పనిచేస్తున్నందువలన వారి పిల్లలు అడయారు పాఠశాలలో చదువుతుండేవారు. తమిళంలో గాని, ఆంగ్లంలో గాని చదవవలసి వచ్చినందు వలన నేర్చుకున్నది వ్యక్తీకరించటం కృష్ణమూర్తికి ఎంతో క్లిష్టమైంది. బెత్తపుదెబ్బలు తినవలసి వచ్చేది. దివ్యజ్ఞాన సమాజంలోనికి తీసుకోబడిన తరువాత అక్కడ లభించిన శ్రద్ధాసక్తుల వలన, ప్రత్యేక బోధనల వలన పరిస్థితి మారింది. కాని కష్టపడి చదివినా మరచిపోతుండటం వలన కృష్ణమూర్తి ఎన్నడూ మంచి విద్యార్థి కాలేదు. ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాల్లో చేరే ప్రయత్నాల్లో వ్రాసిన ప్రవేశ పరీక్షలోను ఉత్తీర్ణత నొందలేదు. విషయాన్ని బట్టీపట్టి జ్ఞాపకముంచుకునే నైపుణ్యంలేదు. కృష్ణమూర్తి తన ఆలోచనలను వెంటనే వ్యక్తీకరించ లేకపోయినా విషయాన్ని విశాలదృక్పథంతో గ్రహింపగలిగేవారట. కీట్స్, షెల్లీ కవిత్వాలంటే వీరికి ప్రీతి. 'సులభమైన చావంటే నా కెంతో ప్రేమ' అన్న పాదాన్ని ఎప్పుడూ వల్లిస్తూ వుండేవారట. చాలా శ్రమకు లోను చేసే టెన్నిస్ వంటి ఆటల్లో నిత్యమూ పాల్గొనెడివారట. ఛాయాగ్రహణమన్న ఎంతో యిష్టాన్ని పెంచుకున్నారట.

**ఆర్డర్ ఆఫ్ దిస్టార్ అధిపతిగా** : దివ్యజ్ఞాన సమాజంవారు రాబోయే విశ్వగురు పీఠానికి తయారుజేసేందుకు 'ఆర్డర్ ఆఫ దిస్టార్ ఇన్‌ది ఈస్ట్'అనే సంస్థకు కృష్ణమూర్తిని అధిపతిగా జేశారు. 1911 డిశెంబరు 2న ఆ సంస్థ నిర్వహించిన ఒక సభలో దాని సభ్యత్వ కాగితాలను అందిస్తూంటే ఆ సభ్యులు కృష్ణమూర్తి పాదాలను అంటి ప్రమాణం జేయనారంభించారట. ఆనాటి నుండి వీరికి ఆరోజొక పవిత్ర దినమయింది.

**ఇండియా దాటి అడుగిడుట** : కృష్ణమూర్తి, నిత్యానందులను కేంబ్రిడ్జ్ విశ్వ విద్యాలయంలోగాని, ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో గానీ చేర్చే ఉద్దేశ్యంతో అనిబిసెంట్

ఇంగ్లాండు తీసుకెళ్ళారు. అక్కడ వీరు వాస్తు శిల్పి ఎడ్విన్ లుటిన్స్ సతీమణి ఎమిలీలు టిన్స్‌ను కలుసుకున్నారు. కృష్ణమూర్తి ఆమెను 'అమ్మా' అని పిలిచేవారు.

కేవలం చదువుకేకాక ఆర్డర్ అఫ్‌ది స్టార్‌కు ఎడిటర్‌గా కూడా కొంత సమయాన్ని అంకితం చేసేవారు కృష్ణమూర్తి. ఆ సంస్థకు అధిపతిగా ఎందరితోనో ఉత్తరప్రత్యుత్తరాలు వ్రాయవలసి వచ్చేది. ఐదుతలాలున్న వెండి నక్షత్రాలను పొదిగిన బాడ్జీలను గజాల కొద్దీ పొడవున్న రిబ్బనును కత్తిరించి తన స్వహస్తాలతో తయారుచేసి 'ఆర్డర్ ఆఫ్ ది స్టార్' సభ్యులందరికి ఇవ్వవలసి వచ్చేది. ఈ బాధ్యతల వత్తిడి పట్ల విముఖత, వ్యక్తం చేయ లేని అయిష్టత కృష్ణమూర్తిలో గమనించినట్లు 'బ్లైర్‌క్లార్క్' వ్రాశారు. పెరిగిన వైముఖ్యతను, వాటికిస్తున్న ప్రాముఖ్యత పట్ల అనుమానాన్ని తమ్ముడు నిత్యాతో, అమ్మ ఎమిలీతో వ్యక్తం జేస్తుండేవారట. తనకు నిర్దేశించిన పాత్రకు తాను మనఃపూర్వకంగా సిద్ధంగా లేనని తలంచేవారు. దివ్యజ్ఞాన సమాజపు సమావేశాలలో ఉపన్యాసాలు, మాగజైనులో వ్రాసే వ్యాసాలు పెద్ద నిధులను సమకూర్చేవి. ఎందరినో సభ్యులుగా జేసేవి.

తత్వశాస్త్రం, ఆర్థికశాస్త్రం, మతం, విద్యల గూర్చి ఏ అటంకం లేకుండా పఠించడానికి 'కాలిఫోర్నియా, స్విట్జర్లాండ్‌లకు వెళ్ళ నిశ్చయించి అనిబిసెంట్ సమ్మతి నొందారు. నిత్యమూ అక్కడ ధ్యానం జేసేవారు. క్రమంగా కృష్ణమూర్తి శరీరాన్ని మనస్సును ఎంతగానో బాధించే 'నూతన ప్రక్రియ' తనలోనుండే బయలుదేరి దాదాపు రెండు సంవత్సరాలు ప్రతిసారి కొన్ని రోజుల తరబడి బాధించేది. కాని ఆ సమయంలో ఎంతో అంతః పరిశీలన జరిగింది. కృష్ణమూర్తి జీవితంలో యీ ప్రక్రియ ఒక గొప్ప మలుపు.

1921లో 'అమ్మెన్'లో అంతర్జాతీయ 'స్టార్' కాంపులో అధ్యక్షునిగా మాట్లాడుతూ 'నిన్ను నీవు మరచిపో. అప్పుడే నన్ను కనుగొనగలవు' అన్నారు కృష్ణమూర్తి. అనారోగ్యంతో బాధపడుతున్న తమ్ముడు నిత్యానందు గురించి గురువులే బాధ్యత వహించుతారని, ఏ ప్రమాదము వాటిల్లదని పదేపదే తన అనుయాయులు చెప్పిన మీదట 1925లో ఇండియాకు బయలుదేరిన కృష్ణమూర్తికి మార్గమధ్యంలో తమ్ముడు నిత్య ఒహైలో మరణించిన వార్త అందింది. అది కృష్ణమూర్తినెంతో కుదిపివేసింది. ఆ పైన అంతః విప్లవాన్ని తెచ్చి దివ్యజ్ఞాన సమాజపు కన్వెన్షన్‌లో పాల్గొన్నప్పుడు నూతన బలాన్నిచ్చింది. ప్రసిద్ధమైన అడయారు మర్రిచెట్టు క్రింద జరిగిన సభలో కృష్ణమూర్తి ఉపన్యాసం విన్న సభ్యులు దేవుడే ఆయనద్వారా మాట్లాడినట్లుందని చెప్పారు.

ఇంగ్లాండు తీసుకెళ్ళారు. అక్కడ వీరు వాస్తు శిల్పి ఎడ్విన్ లుటిన్స్ సతీమణి ఎమిలీలు టిన్స్‌ను కలుసుకున్నారు. కృష్ణమూర్తి ఆమెను 'అమ్మా' అని పిలిచేవారు.

కేవలం చదువుకేకాక ఆర్డర్ అఫ్‌ది స్టార్‌కు ఎడిటర్‌గా కూడా కొంత సమయాన్ని అంకితం చేసేవారు కృష్ణమూర్తి. ఆ సంస్థకు అధిపతిగా ఎందరితోనో ఉత్తరప్రత్యుత్తరాలు వ్రాయవలసి వచ్చేది. ఐదుతలాలున్న వెండి నక్షత్రాలను పొదిగిన బాడ్జీలను గజాల కొద్దీ పొడవున్న రిబ్బనును కత్తిరించి తన స్వహస్తాలతో తయారుచేసి 'ఆర్డర్ అఫ్ ది స్టార్' సభ్యులందరికి ఇవ్వవలసి వచ్చేది. ఈ బాధ్యతల వత్తిడి పట్ల విముఖత, వ్యక్తం చేయ లేని అయిష్టత కృష్ణమూర్తిలో గమనించినట్లు 'బ్లైర్‌క్లార్క్' వ్రాశారు. పెరిగిన వైముఖ్యతను, వాటికిస్తున్న ప్రాముఖ్యత పట్ల అనుమానాన్ని తమ్ముడు నిత్యాతో, అమ్మ ఎమిలీతో వ్యక్తం జేస్తుండేవారట. తనకు నిర్దేశించిన పాత్రకు తాను మన:పూర్వకంగా సిద్ధంగా లేనని తలంచేవారు. దివ్యజ్ఞాన సమాజపు సమావేశాలలో ఉపన్యాసాలు, మాగజైనులో వ్రాసే వ్యాసాలు పెద్ద నిధులను సమకూర్చేవి. ఎందరినో సభ్యులుగా జేసేవి.

తత్వశాస్త్రం, ఆర్థికశాస్త్రం, మతం, విద్యల గూర్చి ఏ అటంకం లేకుండా పఠించడానికి 'కాలిఫోర్నియా, స్విట్జర్లాండ్‌లకు వెళ్ళ నిశ్చయించి అనిబిసెంట్ సమ్మతి నొందారు. నిత్యమూ అక్కడ ధ్యానం జేసేవారు. క్రమంగా కృష్ణమూర్తి శరీరాన్ని మనస్సును ఎంతగానో బాధించే 'నూతన ప్రక్రియ' తనలోనుండే బయలుదేరి దాదాపు రెండు సంవత్సరాలు ప్రతిసారి కొన్ని రోజుల తరబడి బాధించేది. కాని ఆ సమయంలో ఎంతో అంత: పరిశీలన జరిగింది. కృష్ణమూర్తి జీవితంలో యీ ప్రక్రియ ఒక గొప్ప మలుపు.

1921లో 'అమ్మెన్'లో అంతర్జాతీయ 'స్టార్' కాంపులో అధ్యక్షునిగా మాట్లాడుతూ 'నిన్ను నీవు మరచిపో. అప్పుడే నన్ను కనుగొనగలవు' అన్నారు కృష్ణమూర్తి. అనారోగ్యంతో బాధపడుతున్న తమ్ముడు నిత్యానందు గురించి గురువులే బాధ్యత వహించుతారని, ఏ ప్రమాదము వాటిల్లదని పదేపదే తన అనుయాయులు చెప్పిన మీదట 1925లో ఇండియాకు బయలుదేరిన కృష్ణమూర్తికి మార్గమధ్యంలో తమ్ముడు నిత్య ఒహైలో మరణించిన వార్త అందింది. అది కృష్ణమూర్తినెంతో కుదిపివేసింది. ఆ పైన అంతః విప్లవాన్ని తెచ్చి దివ్యజ్ఞాన సమాజపు కన్వెన్షన్‌లో పాల్గొన్నప్పుడు నూతన బలాన్నిచ్చింది. ప్రసిద్ధమైన అడయారు మర్రిచెట్టు క్రింద జరిగిన సభలో కృష్ణమూర్తి ఉపన్యాసం విన్న సభ్యులు దేవుడే ఆయనద్వారా మాట్లాడినట్లుందని చెప్పారు.

తానుమాత్రం ఎంతో నిబ్బరంగ అనిబిసెంట్‌ను ఓదార్చుతూ 'ఈ పరిణామాలు తప్పవు. ఒక విధంగా అవసరం గూడా' నని వ్రాశారు. ఆనాటి నుండి వివిధ రకాల మనుషులతో మాట్లాడుతూ, వారిని ప్రశ్నిస్తూ, చర్చిస్తూ సమాధానాల నిస్తూ ఒక చోటనుండి మరొక చోటికి తిరుగుతూనే ఉన్నారు. వారి ననుసరించుతూ వచ్చిన వారెందరో మధ్యలోనే ఆగిపోయారు. ' ఒంటరి తనం నాకొక గొప్ప స్ఫూర్తినిచ్చింది. నాకు కావలసిందీ అదే! 'నేనేమీ అయిపోను. అన్నిరకాలైన కృత్రిమ ప్రయత్నాలనూ అంతం చేద్దామను కుంటున్నాను.' అని ఎమిలీ అమ్మకు కృష్ణమూర్తి వ్రాశారు. 'మనుషులందరితోనూ - 'మీరు మారాలి, సంతోషంగా జీవించాలి' అని అరచి చెప్పాలనుంద'ని వ్రాశారు.

శ్రీమతి ఆనిబిసెంట్ 1933వ సంవత్సరం సెప్టెంబరు 20వ తేదీన ప్రశాంతంగా కన్నుమూశారు. ఆనాటి నుండీ దివ్యజ్ఞాన సమాజంతో చివరి బంధాన్ని గూడా పోగొట్టు కుని అన్ని ఆధ్యాత్మిక సంస్థల నుండీ స్వేచ్ఛనొంది కృష్ణమూర్తి తనదారిన తానుపోయారు.

1970వ సంవత్సరం నుండీ కృష్ణమూర్తి బోధల పట్ల శాస్త్రీయ ప్రపంచానికి కుతూహలం బయలుదేరింది. అన్నిటికంటే పిల్లల విద్య కృష్ణమూర్తికి ప్రీతి పాత్రమైంది. వారి ప్రోద్బలంతో ఇండియాలోని మదనపల్లి, మద్రాసు, బెంగుళూరు, వారణాసి, కలకత్తాల్లోనూ, ఇంగ్లండులోని బ్రూక్‌వుడ్ పార్క్‌లోనూ, అమెరికాలోని ఓహైలోనూ స్థాపించిన విద్యా సంస్థలెంతో ప్రసిద్ధి కెక్కాయి.

మనుషుల మధ్య అడ్డుగోడలై నిలుస్తున్న దేశ, జాతి, మత, కుల, వర్గ భేదాలు లేకుండా బాలలు పెరగాలన్నదే యీ అంతర్జాతీయ విద్యా సంస్థల స్థాపనకు మూలకారణం. ఈ సంస్థలను ప్రతి సంవత్సరం దర్శించి, విద్యార్థులతో, ఉపాధ్యాయులతో చర్చిస్తూ, వారికి ఉత్తరాలు వ్రాస్తూ ఉండేవారు. అవి 'పాఠశాలలకు ఉత్తరాలు' అనే శీర్షికతో రెండు సంపుటాలుగా వెలువడ్డాయి. కృష్ణమూర్తి 92 సంవత్సరాలు జీవించి అమెరికాలోని ఓహైలో 1986వ సంవత్సరం ఫిబ్రవరి 17వ తేదీన దివంగతులైనారు. వారు ఉపాధ్యాయులతో, విద్యార్థులతో, శాస్త్రజ్ఞులతో, మానసిక శాస్త్రవేత్తలతో, మానసిక ఆరోగ్య శాస్త్ర నిపుణులతో, నాయకులతో, సన్యాసులతో జరిపిన చర్చలు, ఉపన్యాసాలు రికార్డు చేయబడ్డాయి. వినటానికి, చూడటానికి క్యాసెట్ల రూపంలో, చదవటానికి వీలుగా అర్థవంతమైన శీర్షికలతో పుస్తక రూపాల్లో కృష్ణమూర్తి ఫౌండేషన్ సభ్యులు పదిలపరచారు.

కృష్ణమూర్తి థియొసాఫికల్ సొసైటీలో నేర్చుకున్న, పొందిన ఇంద్రియాతీత అనుభవాల గురించి, ఆయనకు కొన్ని అతీత శక్తులున్నట్లు ఇతరులు అనుకోవటాన్ని

గురించి ఆయనెప్పుడూ మాట్లాడటానికిష్ట పడలేదు. బహుశా అట్టి ప్రచారం వలన ప్రజలు తననొకమానవాతీతునిగా తలంచి దేవుడిగా కొలవటం ప్రారంభిస్తారేమోనని, తనకూ తాను చెప్తున్నది వింటున్న వానికీ మధ్య భయం భక్తీ చోటు చేసుకుంటాయేమోననీ, భయంతో నిండిన ఆ మనసు స్వేచ్ఛ లేనిదై తానుసూచిస్తున్న విధంగా అంతఃపరిశీలనలో స్వస్వరూప జ్ఞానాన్ని పొందనీయక ఆటంక పరుస్తుందనీ, అందువలన మానవాళి తానందించాలనుకున్న సహాయాన్నందు కోలేదేమోనన్న దూరదృష్టితో జాగ్రత్త వహించి యుండవచ్చు. మానవాళి సుదీర్ఘ చరిత్రలో సాధారణ మానవులు వారి ఆశలతో ఆశయాలతో మార్గదర్శకులు, గురువులు అనుకునే వారి పట్ల ఆకర్షితులయి వారికి ఎంతగా నిబద్ధులవుతారో ఆకళింపు చేసుకున్న కృష్ణమూర్తి తనకు చేకూరిన అసాధారణ శక్తులను మరుగు పరచి ప్రతి ఒక్కరూ సత్యాన్ని దర్శించాలన్న తపనతో స్వస్వరూప జ్ఞానాన్నెలా పొందాలో చూడమంటూ మానవాళిని నడపించటం వారినొక అగ్రస్థానాన నిలుపుతుంది.

సృష్టిలో అమిత బుద్ధిశాలియైన మనిషి గూడా కృష్ణతత్వాన్ని, రామతత్వాన్నీ, అల్లా క్రీస్తు బౌద్ధ తత్వాలను వదలి కృష్ణుడిని, రాముడిని, బుద్ధుడిని, అల్లాను, క్రీస్తును దేవతలుగా కొలుస్తూ వారి తత్వాలను గాని తమ ఆత్మ తత్వాలను గాని దర్శింప లేక మనుషులను మతం పేరిట, దేశం పేరిట విడగొట్టి యుద్ధానికి దుఃఖానికి దారి దీస్తున్నాడు. తనకూ తన చుట్టూ వున్న వారికీ మధ్య ఎలాంటి అంతరమూ లేకుండా వారికెంతో దగ్గరగా వుంటూ తన కనుభవమైనవన్నీ అందరికీ అనుభవం గావాలని జీవిత పర్యంతమూ కృష్ణమూర్తి తపించారు.

ఎందరో మహానుభావులు జీవన స్రవంతిలో అంతర్ముఖులై సత్యాన్ని దర్శించారు. కాని మరెందరో వారిని గురువులుగా భావిస్తూ, సేవిస్తూ తమకు గూడా సత్యాన్ని సాక్షాత్కరింపజేయమంటూ వారిపై పూర్తిగా ఆధారపడుతుంటారు. కొన్ని క్రతువులు జేయాలనుకుంటూ, కొన్ని లక్ష్యాలనుంచుకొని, అంచెలంచెలుగా సాధించాలనుకుంటూ, సాధించిన దెంతో బేరీజు వేసుకుంటూ తమ జీవిత కాలాన్ని వెచ్చిస్తుంటారు. అట్టి వృధా ప్రయాసలకు చలించిన కృష్ణమూర్తి సత్య దర్శనానికి నిర్దిష్ట మార్గం లేదనీ,

గురువుల అవసరం లేదనీ, ఎవరికి వారుగా స్వస్వరూప జ్ఞానాన్ని పొందవలెనని అందుకు తననొక అద్దంలాగా మాత్రమే ఉపయోగించుకోమనీ పదే పదే చెప్పేవారు. సాటి మానవుల పట్ల వారికున్న కరుణతో, అందరికీస్వస్వరూప జ్ఞానాన్ని పొందటం సాధ్యమేనన్న సమభావనతో ఇట్టి జ్ఞానాన్ని పొందటానికి చేసే ప్రయత్నాల్లో ఎదురయ్యే మానసిక క్లిష్టతలనన్నింటిని వెలికి తీసి చూపుతూ ఉండేవారు.

మనమిప్పుడున్నది విద్యావ్యాప్తికి పరిమితులున్న పురాతన కాలంలోగాదు. మనిషి ఎక్కడున్నా ఆతడి అనుభవాలను, జ్ఞానాన్ని సులభంగా అందిపుచ్చుకోగల్గిన సౌకర్యమున్న ఇరువదవ శతాబ్దంలో! క్రీస్తే దేవుడనో, అల్లాయే దేవుడనో పరిమితు లేర్పరచుకోబోయే ముందు స్వచ్ఛంగా యోచిస్తే అపరిమితమైన ఈ విశ్వశక్తిని మన బుద్ధితో ఎంత పరిమితం జేస్తున్నామో తట్టకపోదు. అట్టి స్వచ్ఛమైన మనసుకై విచారణ జేస్తూ పరిశోధించిన గొప్ప మానసిక తత్త్వవేత్త కృష్ణమూర్తి. ఆలోచన నంతం జేయమని విప్లవాత్మకంగా సూచించిన కృష్ణమూర్తి బోధలను చదవటానికి, వినటానికీ ఎందరో జంకుతారు. కృష్ణమూర్తి యిలా అనేది భౌతిక జీవితానికి అవసరమైన జ్ఞానాన్ని, శాస్త్రీయ సాంకేతిక జ్ఞానాన్నీ, వాటి స్మృతులనూ, వాటిపై సాగించే ఆలోచనలనూ ఉద్దేశించి గాదు. మనుషుల మధ్య నున్న పరస్పర సంబంధాలలో' నేను' కేంద్రంగా చేసే ఆలోచనలు, వాటికి మూలమైన అనుభవాలు, స్మృతుల గురించి! అవి చేతనలోని విషయ సామగ్రిగా, భూతకాలపు బరువుగా, భవిష్యత్తులోనికి ప్రక్షేపింప బడిన ఆశగా, ఆశయంగా, లక్ష్యంగా ఉండడం చేత మనిషి వర్తమానంలో ప్రత్యక్ష దృష్టితో నిలిచి జీవిత సారాన్ని పొందలేక పోతున్నాడన్న ఆవేదనతో అన్నమాట! ఆలోచన అంతమైన క్షణాలలోనే ఆ నిశ్శబ్దతలోనే ఉన్నది ఉన్నట్లుగా దృష్టికి వచ్చి, అసలైన అర్థం స్ఫురిస్తుంది.

## కృష్ణమూర్తి శైలి

మానవునికెదురయ్యే మౌలిక సమస్యలను సులభంగా ఎదుర్కోవటమే కృష్ణమూర్తి శైలి. ఆ సౌలభ్యం ఏ వత్తిడికీ లోనుగాని నిర్భయమైన మనసుకు మాత్రమే

సాధ్యం. తేట దృష్టితో సూటిగా తాజాగా మానవ జీవితాన్ని కృష్ణమూర్తి దర్శించారు. తనతోపాటు తాను చెప్తున్నది వింటున్న వారిని, చదివేవారిని గూడా జీవితాన్ని సూటిగా దర్శించేట్లు చేయగలగటం కృష్ణమూర్తి ప్రత్యేకత. కాని తాను చెప్తున్నదాన్ని వెంటనే ఎవరినీ తేలికగా ఒప్పుకోనీయరు. అనుసరింపనీయరు. 'తాను గురువును కాననీ, అందరికీ కనిపించటానికే కేవలం యీ ఎత్తైన పీఠంపైన ఆసీనుడ నయానని' పదేపదే చెప్తుండేవారు. వాతావరణ మనుకూలించినప్పుడు ఎక్కువగా బహిరంగ ప్రదేశాల్లో ఉపన్యసిస్తూండేవారు. సభారంభంలో కృష్ణమూర్తిని సాధారణంగా ముకుళిత హస్తాలతో నమస్కరిస్తున్నట్లు చూస్తాము. పాదాలనంటి ప్రణామం జేయనీయరు. అలాచేసిన పక్షంలో తానుగూడా వారి పాదాల నంటి అభివందనం జేస్తారు.

తన ఉపన్యాసాలను వినవచ్చేవారిలో తాజాదనాన్ని ప్రతిస్పందనలను అభిలషించే వారు. వింటున్న వారిలో హఠాత్తుగా మార్పు వస్తుందేమోనన్నట్లు పరికిస్తుండేవారు. కాని రానట్లు గ్రహిస్తూ అప్పుడప్పుడు 'అర్థంజేసుకోరేమండీ', 'మీరు ప్రయత్నించరు' అంటూ ఉండేవారు.

ఆయన బోధలను ఉపన్యాసాలను వినేవారు 'పదాల' అర్థాల్లో మునిగి పోతారేమో నన్న భయంతో 'పదమే వస్తువుగాదు' అని పదేపదే జ్ఞాసకం జేస్తుండేవారు, శాస్త్రజ్ఞునితో చర్చించినా, సాధారణ మానవునితో, బాలునితో మాట్లాడినా త్వరపడి విషయాన్ని పరిష్కరించక పోవటం, సలహాల నీయ ప్రయత్నించక పోవడం వీరిలో ఎన్నదగిన లక్షణాలు. అందరికీ అన్వయించే ప్రశ్నలనెన్నో ఉత్పన్నము జేస్తారు. ఆ ప్రశ్నలు విన్నప్పుడు 'ఇంతటి సులభమైన సూటి ప్రశ్నను మనమెందుకు వేసుకోలేక పోయామా అన్పిస్తుంది. అంతటి సూక్ష్మమైన పరిశీలన నెందుకు జేయలేక పోయామా అన్పిస్తుంది.

సమాధానం ప్రశ్న నర్థం చేసుకోవటం లోనే ఉన్నదని కృష్ణమూర్తి అన్నప్పుడు, వారి మార్గం సత్యబద్ధమైనదీ ఎంపిక కవకాశం లేనిదీ గనుక వారు చెప్పినది గ్రహించినపుడు 'నేను' అన్నది పూర్తిగా ధ్వంసమయినట్లుంటుంది. మానవాళి పట్ల వారికున్న దయకు కదిలిపోయి వారు చెప్పిన దాన్ని గూర్చి ఆలోచిస్తాము. వారు చెప్పిన దానిని విన్న కొంత మంది ఏమీ మిగులదని, అర్థం కాలేదని అంటుంటారు. కాని వాస్తవాన్ని చూస్తే, చూసిన దానిని కాదని త్రోసి వేయకుంటే అవన్నీ జీవిత వాస్తవాలని, క్లిష్టమైనవి గావని తోస్తుంది.

తనకూ వినేవారికి మధ్య పదాన్ని అడ్డుగోడగా నిలువనీయగూడదని కృష్ణమూర్తి ఎంతో ప్రయత్నిస్తారు. 'పదం' చేసే అల్లరి గురించి పలుమార్లు హెచ్చరిస్తుంటారు. 'మైక్రోఫోన్' అన్న పదమే మైక్రోఫోన్ గాదని ఉదహరిస్తుంటారు. ఈ మాటనవ్వులాటగా తోస్తుంది గాని వినేవారికి మైక్రోఫోనుకు మధ్య పదాన్ని పారద్రోలాలని కృష్ణమూర్తి చేసే తీవ్ర ప్రయత్నం జూస్తే - 'మైక్రోఫోన్ అన్న పదం మైక్రోఫోను ఎలా అవుతుందీ అని హఠాత్తుగా తోస్తుంది. మనిషి వస్తువును పదంతో ఎలా ఏకీకరణం చేస్తున్నది. పదాలలో, వాటి వ్యక్తీకరణలో ఎంతగా చిక్కుకుపోతున్నదీ ఒక్కసారిగా తడుతుంది.

వారి ఉపన్యాసంలో వట్టి పదాలు గాక పదాల అర్థం, అంతరార్థం మన వైపు ప్రవహిస్తున్నట్లుంటుంది. సులభమైన పదాల్లో అంతభావాన్ని వ్యక్తపరచటం అద్భుతంగా తోస్తుంది. అంతటి నగ్నసత్యాలు మనకెందుకు ముందు తట్టలేదా! అనిపిస్తుంది. తప్పుడు పునాదులపై కట్టుకున్న అసత్యజీవితము సత్యజ్యోతుల వెలుగులో కూలిపోతుంది. మొదటగా ఉపన్యాసం విన్నప్పుడు మనమేమి మిగలమన్నట్లు భయపడతాము. మరికొంత ఓర్పుతో సంయమనంతో ఉండి, మనలను భయపెట్టేదేదో, మనకు మిగలనిదేదో అంటే ఖాళీ అయ్యేదేదో తెలుసుకుంటే పూర్తిగా ఒక నూతన జగత్తులో అడుగిడినట్లుంటుంది.

కృష్ణమూర్తి అసత్యము, అసంబద్ధమూ ఐన దానిని ఎత్తిచూపుతారు. 'కృష్ణమూర్తి తలుపు తెరుస్తారు. లోపలికి తొంగి చూచే లోపల తమ ముఖాలపై హఠాత్తుగా తలుపులు వేస్తారు' అంటారు. వారికెంతో దగ్గరగా తిరుగుతుండే వారే! దీనినొక పితూరిలాగాక అనుభవసారంతో సిద్ధం చేసిన సమాధానాలను, పరిష్కారాలను ఆశించే వ్యక్తి నిస్పృహతో అనే ఓ మాటలాగా గ్రహించాలి. మనిషి సాధారణంగా ఒక పరిష్కారాన్ని గాని, వెలుగునుగాని, సత్యాన్నిగాని, దేవుడినిగాని చూపితే చూద్దామనుకుంటాడు. ఇందుకు కృష్ణమూర్తి పూర్తిగా విరుద్ధం. తననొక సూచికగా వాడుకుంటూ నీతివంతమైన పరిశోధన చేయటం వీరి ధ్యేయం. ఈ నిష్కపట పరిశోధనలో ఏర్పడే అడ్డంకులనన్నిటిని మనకు వీరు చూపటానికి ప్రయత్నిస్తారు. అసత్యమేదో చెప్పబోతారు. అనుభవంలోనికి రాని ప్రేమను మాటల్లో వల్లింపలేము గదా ! అందుకే ప్రేమ కానిదేదో చూడమంటారు. ప్రేమంటే ఈర్ష్య కాదు, హింసకాదు, అసూయకాదు అంటారు. ఆ విధంగా చూడటం వలన ప్రేమన్నది అనుభవం గాదేమో గాని తన గాఢ అనుభవం ప్రేమ అవునో కాదో ప్రశ్నించుకో వచ్చు గదా ? ఇట్టి విచారణ మనిషిని నిష్కల్మషంగా జేస్తుంది.

కొందరు 'నేతినేతి' ప్రక్రియకు కృష్ణమూర్తి బోధలు దగ్గరగా ఉంటాయంటారు. కృష్ణమూర్తికి మానవాళి పట్ల వున్న గాఢానురాగాన్ని చూసిన తర్వాత ఇది మూలంలేని విమర్శని తోస్తుంది. బద్ధకాన్ని ప్రయత్నం చేయకపోవడమని, మిన్నకుండటాన్ని నిశ్శబ్దమని పొరపడినట్లవుతుంది. మానసిక జీవితానికి అన్వయించవలసిన దానిని భౌతిక జీవితానికి అన్వయించి పొరపడటం జరుగుతుంది.

తనను తాను పరిశీలించుకుంటూ చేసే పరిశోధన జీవితాన్ని జీవించేటట్లు జేస్తుంది. 'నేను' సమసిపోతుంది గనుక చావు భయముండదు. 'రాలిపోవటానికి గడ్డిపరకకున్న సంసిద్ధతే దాని శక్తి అంటారు కృష్ణమూర్తి.

## కృష్ణమూర్తిలో ఉపాధ్యాయుడు

ఎందరో వారి అనుమాన నివృత్తి కోసం కృష్ణమూర్తి దగ్గర కొస్తారు. వారందరు చెప్పిన దానిని శ్రద్ధగా విని ఆపై ప్రశ్నిస్తూ వారితోనే విచారణ జేయించి ఆ సమస్య మూలం వరకు తీసుకెళతారు. ఆ సమస్య నగ్నస్వరూపాన్ని చూపుతారు. ఆ చర్చలలో ఎదుటి వారిని నమ్మించటానికి ఒప్పించటానికి ఏ మాత్రం ప్రయత్నింపరు. త్వరపడి అశాస్త్రీయ ముగింపుకు రానీయరు. సంశయాత్మకమైన అభిప్రాయానికి ఆచర్చలో చోటీయరు. అత్యంత శ్రద్ధ, చురుకుదనం ఆసాంతమూ కనబరుస్తారు. పూర్తి అర్థాన్ని తెచ్చేందుకు ఖచ్చితమైన వర్ణనకు తగిన పదాల పొందిక కోసం తగినన్ని మార్పులు చేస్తారు. ఎదుటి వారిపైన ఎటువంటి అధిక్యతను ప్రదర్శింపరు. నిర్విరామంగా, శ్రద్ధతో ప్రశ్నిస్తూ ఎదుటివారు వాస్తవ విషయాన్ని సత్యాన్ని చేరే వరకు చర్చిస్తారు. అనవసరమైన సానుభూతి ప్రదర్శించి తనపైన ఆధారపడటాన్ని ప్రోత్సహింపరు. ప్రతి ఒక్కరూ నిబద్ధులవక తనకు తానుగా విషయాన్నర్థం జేసుకోవాలనే తపన వారి ప్రతి ప్రయత్నం లో సంబంధాలలో కనిపిస్తుంది. ఉన్నది ఉన్నట్లుగా దాని సహజత్వాన్ని కనుగొనేందుకు ఆహ్వానించేవే కృష్ణమూర్తి బోధలు !

నిజమైన, స్వచ్ఛమైన విద్యావేత్తలాగా పిల్లల శరీరం, మనస్సు హృదయం మూడు వికసించాలంటారు. ఏదో ఒక్క విషయానికి ఎక్కువ ప్రాధాన్యతనిస్తే అసమగ్ర వికాసం గలుగుతుందంటారు. ఇంటిలో స్కూలులో భద్రత, స్వేచ్ఛ అనుభవించే పిల్లలలో వారి అంతర్గత శక్తి వెలువడే అవకాశముంటుందంటారు. కేవలం బుద్ధినే గాక ప్రజ్ఞను, శరీరాన్ని, హృదయాన్ని వికసింప జేసేందుకు శ్రద్ధజూపితే వారి శక్తి నిష్ప్రయోజనం

గాకుండా సవ్యంగా పూర్ణంగా వినియోగింపబడుతుందన్న కృష్ణమూర్తి దూరదృష్టి మరే విద్యావేత్త ప్రయత్నాలకు తక్కువ కాదు.

## మనో పరిశీలనలో కృష్ణమూర్తి

మానసిక శాస్త్రం తత్త్వ శాస్త్రంలో ఒక భాగంగా ఉండేది. పందొమ్మిదవ శతాబ్ద ప్రారంభంలో తత్త్వశాస్త్రాన్నుండి విడివడి ప్రత్యేకశాస్త్రంగా ఆవిర్భవించే తరుణంలో విజ్ఞాన శాస్త్రంతో ప్రభావితమయి శాస్త్రస్థాయిని పొందాలన్న ఆశయంతో ప్రయోగాన్ని ఖచ్చితప్రమాణంగా అంగీకరించింది. మనస్తత్వశాస్త్రం యీ ప్రయోగాల ఫలితంగా ఎన్నోవిభాగాలుగా విస్తరించింది. ఉదాహరణకు సైకోఫిజిక్స్ లో మానవుని ఇంద్రియ కార్యాలు, వాటి నిశిత నిర్దిష్ట శక్తులు, అనుబంధిత ప్రవర్తన; 'ఫిజియలాజికల్ సైకాలజి' లో పుట్టిన బిడ్డ పెరుగుతున్నప్పుడు వివిధ దశల్లో పలురకాలుగా జరిగే మానవవికాసం పొందుపరచబడ్డాయి. సమయానుకూలంగా ప్రవర్తనను పలురీతుల్లో మలుచుకోగల మానవునిపై ప్రయోగాలను జేసి అర్థం జేసుకోవడం కష్టం గనుక యీ ప్రయోగాలను పలు జంతువులపై జేసి అలాంటి ప్రవర్తనే మానవులలో గూడా వున్నట్లు పరిశీలిస్తూ ఎన్నో సూత్రాలను, సిద్ధాంతాలను సాధారణీకరణ జేయటం జరిగింది.

తర్వాత సిగ్మంగ్ ఫ్రాయిడ్ యిట్టి ప్రయోగాలకు అందని అంతర్గత చేతనను వెలికితెచ్చిన తర్వాత సైకో ఎనాలసిస్ అన్న విభాగం వృద్ధి చెంది మానసిక వ్యాధినర్థం జేసుకోవడంలో, విశ్లేషణలో దాని నిర్మూలనలో గొప్పమార్పు తెచ్చింది. మరొకవంక మానవ ప్రవర్తన నిబద్ధితమని 'బిహేవియరిస్టులు' ప్రయోగాత్మకంగా నిరూపిస్తూ, సిద్ధాంతీకరిస్తూ వున్నారు. కాని నిబద్ధత లేని మనసును వారధ్యయనం జేయలేక పోయారు. అట్టి నిబద్ధత లేనపుడు గల నూతనదృష్టిలో నూతన చర్యలు చేపట్టగల మానవుని శక్తి సామర్థ్యాలను ప్రయోగాత్మకంగా నిరూపిస్తూ 'గెస్టాల్టు సైకాలజి' ఆవిర్భవించింది. ఆ తర్వాత మనిషిలోని భావోద్వేగాలెలా ప్రభావితమవుతాయో, ప్రభావితం చేస్తాయో, మానవజీవితంపై వాటి పాత్ర ఎంతోనన్న అంశాలను 'నియోఫ్రాయిడియన్లు' అధ్యయనం జేశారు. మరొకవైపు 'హ్యూమనిస్టిక్ అప్రోచ్' గా ఆరంభమయి 'హ్యూమనిస్టిక్ సైకాలజి'గా పరిణమించుతూ మానవశక్తుల నెంతో వెలుగులోనికి తీసుకురావాలన్న ప్రయత్నాలు గూడా జరుగుతున్నాయి. ఇట్టి దృక్పథాలను సమన్వయించే ప్రయత్నాలు గూడా మరొకప్రక్క జరుగుతున్నాయి.

మానవ ప్రవృత్తిలో అంతరబాహ్యాస్థితులను, నిబద్ధిత అనిబద్ధిత మానసిక స్థితులను సమగ్రదృష్టితో, విశ్లేషణ నధిగమించుతూ మానవుని సంపూర్ణ మనస్తత్వాన్ని కృష్ణమూర్తి దర్శించారు. ఇందుకు వారు ఉపయోగించిన పరికరం అంత: పరిశీలననే కళ, ఇది శాస్త్రానికి లేని ప్రత్యేకమైన సులభమైన సూటియైన రూపరహిత సాధనము. ఎందరో మానసిక శాస్త్రజ్ఞులు లోపభూయిష్టమని తీసివేసిన 'అంత: పరిశీలన' అనే విధానాన్ని లోపరహితంగా 'పరిశీలన' అన్న పేరుతో వీరు మనకందించారు. పరిశీలించు కుంటూ మనిషి తనను తాను కనుగొనాలని పదేపదే చెప్తారు.

కృష్ణమూర్తి పరిశీలిస్తూ అందించిన మానసిక అంశాలు, వాటి పుట్టుక, వాటి ప్రభావం, రకరకాలుగా అవిచెందే మార్పులు నిజానికి ఏమానసిక శాస్త్రజ్ఞుడైనా ఆశ్చర్యపోదగినవి. వీరి పరిశోధన మనసులోని మూలమూలలలోనికి తొంగి చూచి, ఉన్నది ఉన్నట్లుగా గ్రహించటానికి వెలుగు చూపుతుంది. వీరు జీవితమనే పుస్తకంలోని పుటలన్నింటినీ కూలంకషంగా శాస్త్రీయంగా చదివిస్తారు. అవిరామంగా స్వీయ పరిశీలన జేస్తూ, చేయిస్తూ జీవించారు. అట్టి పరిశీలనలో అనుభవాలను తిరిగి పూర్తిగా జీవించటం వలన చేతనలోని విషయాలబరువు తగ్గించే అవకాశం ఎంతైనా ఉంటుందంటారు.

ఒక మానసిక విశ్లేషకుని వలె మనస్సులోతుల్లో నిగూఢంగా ఉన్నదానిని వెలికి తెచ్చి చిత్రీకరిస్తారు. ఎంపిక లేని అవగాహన, భావోద్వేగాల వికాసము ఎప్పుడు సాధ్యమో చూపుతారు. మనోవ్యాధికి ఏవి మూలమో గుర్తించి మానసిక సమస్యా పరిష్కారాలను సూచించే వీరిని మనోవ్యాధి శాస్త్ర నిపుణునిగా నిలబెడ్తాయి. మనిషి శక్తి ఎంతో వృధా అవుతుందని ఎందరో మానసిక శాస్త్రజ్ఞులు కనుగొంటుంటే వీరు ఆశక్తి ఎన్ని రకాలుగా వృధాగాబడుతున్నదో చూపుతారు.

బాహ్యామైన, భౌతిక ప్రపంచపు అవగాహన నిమిత్తమై ప్రయోగాలు చేయాలన్నా, విశ్లేషించాలన్నా శ్రేష్టమైన పరికరాలు, ఉపకరణాలూ ఎన్నో ఉన్నాయి. కాని మనిషి తనను తానర్థం జేసుకోవలసి వచ్చినప్పుడు మాత్రం బహు తక్కువ సాధనాలు కన్పిస్తాయి. ఇట్టి ఆత్మ శోధనకు కన్పించే మార్గాలు రెండు. ఒకటి తనను తానర్థం జేసుకోవటం. రెండ వది యితరులనర్థం జేసుకోవటం. వివేకవంతమైన ఆరంభం సమీప బిందువు నుండే గదా? ఏ పరిశోధకునికైనా అత్యంత సమీప బిందువు తనకు తానే ఏ బిందువైనా 'నేను' 'నాది' అన్న బిందువు కంటే దూరమే గదా?

నేనెవరిని? నీవెవరు? మనమేమిటి? అన్న ప్రశ్నలలో యదార్థానికి మౌలికమైన భేదం లేదు. నేనెవరిని? అన్న ప్రశ్న కేవలం పదార్థ పరంగా చూస్తే శారీరక శాస్త్రానికీ, భౌతిక శాస్త్రానికీ చెందినదనీ పదార్థం కానిదేదైనా తత్వ శాస్త్రానికో, మతానికో, మరొకదానికో చెందిందనీ పొరపడటం జరుగుతుంది.

ఏ మనిషీ తన జీవిత కాలంలో బహుముఖ జ్ఞాన సముపార్జన చేయలేనంతగా విజ్ఞానం శాఖోపశాఖలుగా విస్తరించింది. తన్మూలంగా ప్రత్యేక నైపుణ్యతలను పెంపొందించే నిమిత్తమై పలు విజ్ఞాన విభాగాలు ఆరంభమైనాయి. ఏదో ఒక విజ్ఞాన విభాగంలోనే విజ్ఞానార్జన చేయవలసి వస్తున్నందువలన ఆ భాగాన్ని క్షుణ్ణంగా తెలుసుకోగల్గినా మనిషి ఒక శాస్త్రవేత్తగానో, కళాకారుడుగానో, మానసిక శాస్త్రవేత్తగానో, ఆత్మవాదిగానో లేక శ్రామికుని గానో, వైద్యునిగానో మిగిలిపోతున్నాడు. ప్రత్యేకమైన విభాగంలోనే జ్ఞాన సంపాదన జరగటంతో మిగిలిన విభాగాలతో అతనికేవిధమైన పరిచయమూ లేకుండా పోతుంది. మనిషి తానేమిటో అర్థం జేసుకోవటంలోనూ, మానవాళి సమస్యలకు వెనుకనున్న సామ్యతను పటిష్టంగా చూపించటంలోనూ కృష్ణమూర్తి ప్రత్యేకంగా సహాయ పడతారు. "ప్రపంచంలో ఎక్కడికి వెళ్ళినా మానవులంతా ఒక్కటే.... వారి మానసిక అంతరంగిక సమస్యలూ ఒకటే. ప్రపంచ వ్యాప్తంగా మనిషి గందర గోళపడుతున్నట్లే కన్పిస్తాడు. అస్పష్టంగా, భద్రత లేకుండా ఉన్న యీ గందర గోళాన్నుండి బయటపడే మార్గం కోసం వెతుకుతూ, శోధిస్తూ, ప్రశ్నిస్తూ దృష్టి సారిస్తున్నాడు. మనం జీవిస్తున్న యీ సమాజం మన మానసిక స్థితి ఫలితమే. మనమెలా ఉంటే అలాగే యీ ప్రపంచాన్ని గూడా తయారుజేశాం... మనం దౌర్జన్యం జేస్తాం. మూర్ఖులమై పోటీ పడ్తాం. అందుకు తగినట్లుగానే పోటీపడి మూర్ఖమైన, హింసాత్మకమైన సమాజాన్ని నిర్మిస్తాం గనుక ముందుగా మనలను మనం అర్థం జేసుకోవడమే మన బాధ్యతగా కన్పిస్తుంది, ఎందుకంటే మనమే ప్రపంచం గనుక! అహంభావ పూరితమైన పరిమిత దృష్టిగాదిది! అంటారు కృష్ణమూర్తి.

వీరి పరిశీలనలో వెలువడిన యదార్థాలను కాదనగలమా? వీరు సూచించినట్లుగా తనను తానర్థం జేసుకోవటమంటే పరులనర్థం జేసుకోవటమే! లోతైన

విశాలమైన సముద్రం వంటి జీవితమనే పుస్తకాన్ని కృష్ణమూర్తి స్వస్వరూప జ్ఞాన నిమిత్తమై మనకు పరిచయం జేస్తారు. ఏ రచయిత వ్రాసిన పుస్తకానికైనా ఆ రచయిత చెప్పదలచు కున్నది మాత్రమే చెప్పగల్గిన పరిధి వున్నది. కాని జీవిత పుస్తకాని కటువంటి పరిమితుల్లేవు.

అంతులేని అద్భుతమైన తన వాస్తవ గాథను కనుగొనటానికి ఆసక్తి చూపే చదువరి నిరంతరం పఠింపదగింది జీవితమనే పుస్తకం. అన్నిరకాలైన ఆనందాలను దుఃఖాలను మానవాళికున్న సంఘర్షణలను మనలో ప్రతి ఒక్కరిలోనూ చూడగలం. సమాజము ప్రపంచమూ ఏర్పడింది మానవులతోనే గదా! ఆ మానవుల మానసిక విలువలే సమాజమంటే ఏమిటో నిర్ధారిస్తాయి. మానవుడు సృష్టించిన సాంకేతిక విలువలతోనే సమాజం నడుస్తున్నది. సమాజంలో నున్న గందర గోళానికి కారణం మనిషి చేసే ఆలోచన అంటే అతని భావాలు క్రియలు. తిరిగి యీ గందర గోళ సమాజమే అస్తవ్యస్తమైన మనుషులను తయారు చేస్తున్నది. ఇదొక వలయం.

జీవితమంటే సంబంధ బాంధవ్యాలే నంటారు కృష్ణమూర్తి. జీవితంలోకి మానవ సంబంధాలలోకి దృష్టి సారించి పరికించి 'మనకు ఇతరులపైన శ్రద్ధ ఉండదు. మన స్వవిషయాలపైనే మనకు శ్రద్ధ ఉంటుంది. ఈ సంబంధ బాంధవ్యాలలో మన మిమిడి నట్లుండక దూరంగా వుంటుంటాము.' అని అంటారు. 'ఈ ప్రపంచం భ్రమ' అంటూ దీన్నుండి పారిపోవాలని ప్రయత్నించే సన్యాసి యీ ప్రపంచాన్ని కూడ తనతో పాటుగ మోసుకెళ్తున్న విషయాన్ని గ్రహించుకోలేడు. ప్రాపంచిక విషయాలనాతడు కాదనవచ్చు. వాటి పట్ల కలిగే వాంఛలను అణచవచ్చు. వాంఛించి నందుకు తనను తాను హింసించుకోవచ్చు. కానీ వేలాది సంవత్సరాలుగా అవిచ్ఛిన్నమైన సాంప్రదాయక నిబద్ధ ప్రపంచంతో తనకేదోరకమైన సంబంధముంటుంది. కనుక దీనినుండి అతడు పారిపోలేడు.'

ప్రతి మనిషికీ తన కుటుంబ సభ్యులతో, పొరుగు వారితో సమాజంతో, పాల వానితో, చాకలి వానితో, పోలీసుతో మరెందరితోనో సంబంధముండక తప్పదు. గాలి నీరు చెట్లు వాటి ఫలాలు, భూమి ఆకాశం యిత్యాది ప్రకృతి సంబంధమైన అంశాలపైన గూడా ఎంతో ఆధారపడతాడు. జీవితం అంటే మనిషి ఉనికి అతనికున్న సంబంధ బాంధవ్యాలపై ఆధారపడింది. ఈ సంబంధాల గమనమే జీవితం. అదెన్నో ప్రభావాల ఫలితం.

కుటుంబాన్ని ఏర్పరచుకుని ఆస్తిని సంపాదించుకుని మనిషి తన ప్రత్యేకతను చాటు కోవాలనుకుంటాడు. తానార్జించిన వాటిద్వారా తన స్థాయిని వ్యక్తం జేస్తుంటాడు.

తత్ఫలితంగా ఆశయంపైన, దురాశపైన, పోటీ క్రూరతలపైన, హింస ఆందోళనలపైన సామాజిక రూపమాధారపడింది.

ఈ సమాజం మనలో ప్రతి ఒక్కరిచేతా సృష్టింప బడింది. మనమేమిటో సమాజమూ అదేనన్న యదార్థతను మనలో ప్రతిఒక్కరూ చూడాలంటారు కృష్ణమూర్తి. కేవలం బౌద్ధికావగాహనతో ఒక నిర్ణయానికి రావద్దంటారు. మనలో ప్రతి ఒక్కరమూ సమాజమని సంబంధ బాంధవ్యాలలో తానే ప్రపంచమని యీ పరిశీలనలో తోస్తుంది. 'నేను' అంటే మనిషి ఎవరు? - అని ప్రశ్నించినప్పుడు మనిషి అంటే ముఖ్య కేంద్రంగా మెదడు, దానితోపాటుగా మనిషి నిర్వహించే కార్య కలాపాలు అంటే చేతన అని అనవచ్చు. శరీరము (మెదడు) మనస్సు (చేతన)ల సమ్మిశ్రమ మనవచ్చు.

## మెదడు (Brain)

మానవుని అనుభవాలన్నింటిని ముద్రించే పరికరమే మెదడు. ఇంద్రియాలకు కేంద్రం మెదడు. ఇంద్రియాలెంత సున్నితంగా స్పందిస్తుంటే మెదడంత పదునుగా ఉంటుంది. ఎన్నో పరిణామాలుపొందిన మానవుని మెదడు చిన్నదైనా అత్యంత శక్తితో ఎన్నో విషయాలను కనుగొని అసాధారణ సాంకేతికాభివృద్ధికి మూలమైంది. అంటే యీ మెదడు మానవ కార్యక్రమాలన్నింటికీ మూల పరికరం. ఇంద్రియాల ద్వారా సాధనజేసి అనుభవాలను జ్ఞానాన్ని జ్ఞాపకాలుగా మార్చి నిలువ జేసుకుంటుంది. ఆపైన ఆ జ్ఞాపకాలకు నిబద్ధితమై స్పందిస్తూంటుంది. మానవుని మెదడు వేలాది సంవత్సరాల పరిణామ ఫలితం.

ఆనాటి నుండి యీనాటి వరకు భూతకాలానికి సంబంధించిన జ్ఞాపకాలకు కేంద్రమైన మెదడు ఆ జ్ఞాపకాల్లో జ్ఞానానికి నిబద్ధితమై ఉంటూ, ఆ నిబద్ధత నుండే చెప్పేది వినటానికి, కన్పించేది చూడటానికీ సిద్ధమై యాంత్రికంగా మారింది. అట్టి నిబద్ధితమైన మెదడు నిర్వహించే కార్యాలన్నీ సర్వత్రాహేతు బద్ధమై పరిమితమై ఉంటాయి.

మానవుడు తన బ్రతుకు దెరువుకోసం చేసే ప్రయత్నాలలో మెదడులోని కొంతభాగాన్ని మాత్రమే వినియోగించుకుని మిగిలిన భాగాన్ని నిర్లక్ష్యం జేస్తున్నాడనీ, తన శక్తియుక్తులు వ్యర్థమవటానికి తనచుట్టూ ఉన్న సమాజం విచ్ఛిన్న మవటానికీ కేవలం తానే బాధ్యుడనీ కృష్ణమూర్తి అంటారు. మానవుడు తనకున్న శక్తిని వినియోగించు కోలేక పోవటానికి కారణం స్వార్థ చింతన, పరిమితమైన సంబంధాలూనని, యీ స్వార్థానికి మూలమేమిటో అర్థం జేసుకోవాలనీ చెప్తారు.

## చేతన (Consciousness)

ఒకవైపు శాస్త్రజ్ఞులు, మనస్తత్వ వేత్తలు చేతనను పరిశీలిస్తుండగా, కొందరు చేతన నొక భావనలాగా, మెదడిచ్చే సమాధానంలాగా, ప్రయోగశాలలో ఆల్ఫా తరంగాల్లాగా పరీక్షిస్తుండగా, మరికొందరు గురువులు స్వలాభాపేక్షతో యీ చేతనను పయోగించు కొంటుండగా కృష్ణమూర్తి "మానవాళి మొత్తం ప్రతి ఒక్కరిలోనూ చేతన అచేతనల కలయికగా ఇమిడి ఉందని, తననుతాను లోతుగా పరికించి చూస్తే మానవుడు మానవాళి కథ నంతటినీ గ్రహించగలడు" అంటారు. "సాధారణంగా మనిషి తానేమిటో తెలుసు కోవాలనుకున్నప్పుడు అనుభవజ్ఞులైన గొప్పవారి దృష్టితో అంటే ఒక మనస్తత్వవేత్త సహాయంతో గానీ, మనో విశ్లేషకుని సహాయంతోగానీ, మనో వ్యాధి నిపుణుని సహాయంతో గానీ చూడ ప్రయత్నిస్తాడు. కాని తనను తాను స్వంతంగా అర్థం జేసుకునేందుకు ప్రయత్నింపడు. ఈ విధంగా ఇతరుల దృష్టితో కేవలం రెండవ తరగతి అవగాహన పొందటం తగదని మనిషి తనలోనికి తాను చూసుకోవాలనీ వీరంటారు.

జీవితమొక ప్రవాహం వంటిది. మనిషనే నీటి బిందువు అస్రవంతిలో కదలి పోక తప్పదు. ఇతరుల సహాయంతో జీవితాన్ని విశ్లేషించి అర్థంజేసుకుని దానిప్రకారం నడచు కోవడమంటే జీవిత ప్రవాహానికడ్డుపడి సహజత్వాన్ని కోల్పోవటమే నంటారు. సంపూర్ణమైన ఖచ్చితమైన జీవిత చిత్రాన్ని చూసే మార్గం తనజీవిత వాస్తవాలను సూటిగా చూసుకోవడ మొక్కటే నంటారు. ఈ రకంగా పరిశీలించు కోవటానికి తనను (కృష్ణజీని) ఒక అద్దంలాగా ఉపయోగించు కొమ్మనీ, తనమాటలపై ఆధారపడవద్దనీ, స్వయంగా ఎవరికి వారు తమలోకి చూసుకోవాలనీ చెప్తారు.

'నేను' అన్నది చేతనామయమని, చేతనలోని అంశాలే చేతనయని అంటారు. మనిషి ఆర్జించిన జ్ఞానము, సూక్ష్మమైన కుటిలమైన ఆలోచనలు, బహిర్గతంగాని ఆలోచనలు, సాంప్రదాయాలు, నమ్మకాలు, బాధ ఆందోళనలు, సుఖంకోసం మనిషి నిరంతరంగా సలిపే పోరాటమూ, ఆస్తి అంతస్థుల అహంభావమూ, తనకున్న జ్ఞాన సంపద వలన గల్గిన ఆధిక్యతా, నిగూఢమైన వాంఛలూ, విరుద్ధమైన కోరికలూ, ఆశలు ఆశయాలు వేదనల వంటి వెన్నో చేతనలోని అంశాలేనని అంటే మనిషి ఉనికి మొత్తాన్ని 'చేతన' అనవచ్చునీ సూచిస్తారు.

బహిర్గతమయే చేతనత్వం గాక బయటపడని లోతైన అంతర్గత చేతన గూడ 'నేను'కు కేంద్రమే నంటారు. మనిషి తన జీవితకాలంలో సంతరించుకున్న కోరికలు, భయాలు, ప్రేరణలు, ఒత్తిడులు, హృదయాంతరాలైన విషయాలే గాక జాతిపరంగా సంక్రమించిన సాంప్రదాయబద్ధమైన అనుభవాలు, జాతివిద్వేషాలు, జాతిపరమైన ప్రేరణలు అంతర్గత చేతనలో ఉంటాయి. భూతకాలపు అనుభవాలు భవిష్యత్తు గురించిన ఆశలు చేతనలోనివే. భూతకాలపు అనుభవాలను సంపూర్ణంగా అనుభవింపక పోయినా, వాటిలోనే మునిగిపోయినా వాటినికాదని యీ అసంపూర్ణ అనుభవాలను అనుభవించేసి ముగించాలని తపన పడినా, చివరికి కలల రూపంలో రావటం జరిగినా అవన్నీ చేతనలోని భాగమే. చేతన స్థితిలోనున్న మనసు దేనిలోనైనా నిమగ్నమయినప్పుడు తనకు అంతర్గత చేతనతోనున్న సంబంధాన్ని గుర్తించలేదు.

అంతేగాక ప్రతి ఆలోచననూ భావాన్నీ మనసు యొక్క ప్రతి కదలికనూ గమనిస్తుంటే కలలురావనీ, ఏ సంఘర్షణా లేనప్పుడు ఆ మనసు నిత్య నూతనంగా ఉంటుందనీ ఎంపిక లేక చేసే నిత్య పరిశీలనతో చేతనా చేతనల మధ్య గీతను తుడిచి పెట్టవచ్చునీ అంటారు కృష్ణమూర్తి. అంటే ఎట్టి విశ్లేషణా చేయక దేనినీ ఎదుర్కొనక, 'ఏ విషయంలోను మునిగిపోక మనసు పొరల్లోకి పరిశీలనను సారిస్తూ ఏ విధంగా పని చేస్తుందో అర్థం జేసుకోవాలంటారు. విశ్లేషణ పరిగణన కొంతవరకూ చేయొచ్చుగాని అదే అంతా గాదంటారు. అనుక్షణమూ స్వచ్ఛమైన పరిశీలన జేసినప్పుడు గత విషయమంతా పూర్తిగా మాసిపోయి అంతర్ధానమయినప్పుడే వర్తమాన క్షణాల్లో యదార్థాన్ని చూస్తామంటారు. నిబద్ధితమైన మెదడు మూలంగా మనసులో తన గురించీ తనచుట్టూ ఉన్న వారిగురించీ ఊహాప్రతిమ లేర్పరచుకుంటారు గనుక యీ ఊహా రూపాల నేర్పరచుకునే యంత్రాంగాన్నే అంతంజేయ మంటారు.

మానవుని నిబద్ధత ఒక్క అతడి జీవిత కాలంలోనేగాక మానవజాతి ప్రాదుర్భావం నుండీ ఎలా జరుగుతున్నదో చూసిన కృష్ణమూర్తి మానవాళికి నిబద్ధత లేకుండా ఉండటానికి సహాయ పడేందుకు నిజాయితీగా ప్రయత్నించారు. అందుకే ప్రతి ఒక్కరినీ తన జీవిత కాలంలో ఏర్పరచుకున్న చేతన అంతశ్చేతనల భారాల నుండి ఆత్మ పరిశీలనతో స్వేచ్ఛ నొందమంటారు. స్వేచ్ఛ లేనప్పుడు చేతనను అంతశ్చేతన కప్పి వేస్తుందంటారు. అంతః పరిశీలనలో చేతనా చేతనల్లోని విషయం స్పష్టమవుతుంది. ఒక్కొక్కటిగా విషయమంతా జారిపోతుంది. మనిషికి చేతనా చేతనల స్థాయిలలో

అవగాహన లేనప్పుడు సంపూర్ణ మానవునిగా వికసింప లేడంటారు. అవగాహన లేని మనిషిలో బాహ్యమనసుకు (బాహ్య చేతనకు) అంతశ్చేతనకు సంఘర్షణ జరుగుతుంది. ఈ సంఘర్షణలో తన అనుభవజ్ఞానమే స్వీయ అంతశ్చేతన అవుతుంది. దీనిని గ్రహించిన మనిషికి తన జీవితానికేగాక భావితరాల వారి జీవితాలకు గూడా తానెంత బాధ్యుడో స్ఫురిస్తుంది.

ఆత్మ పరిశీలనలో నిబద్ధత నుండి బయట బడి చేతనా చేతనల మధ్యనున్న గీతను తుడిపి వేసిన మనస్సు మాత్రమే ఏరకమైన విభజనా లేక, ఏవిభేదమూ లేక స్వచ్ఛంగా నిజాయితీగా ఉంటుంది. 'నేను' అన్నకేంద్రం నుండి అట్టి మనసు పనిజేయదు. మనసుకు అప్పుడున్న స్థితిలో నిబద్ధతకు బదులు సంపూర్ణదృష్టి అంతర్దృష్టి కలగడం వలన మెదడు యొక్క కణాలలో పూర్తిగా ఆకస్మిక మార్పు (మ్యుటేషన్) సంభవిస్తుందంటారు కృష్ణమూర్తి.

జ్ఞానేంద్రియాల ద్వారా మెదడనే పరికరంతో మనిషి జ్ఞానార్జన చేస్తాడు. జ్ఞాపకముంచు కుంటాడు. ఆలోచిస్తాడు. ఆ జ్ఞానాన్ని వాటి స్మృతులను, ఆలోచన వివేచనలు చేయటాన్ని, నిర్ణయాలు తీసుకోవటం అన్నింటినీ మనసు అంటారు. మనసు చేసే ఆలోచన 'నేను' అన్న కేంద్రాన్ని పెంపొందిస్తుంది. మనసెప్పుడూ 'నేను' కున్న గతానుభవాలపై ఆధారపడి విధులను నిర్వహిస్తుంటుంది. 'నేను' అనే యీ అహం 'నాది' 'నీది' అంటూ విభజించి ఒంటరిదై ఒంటరి తనాన్ని భరించలేక ఏదో ఒకదానికి చేరువవుతుంది. ఈ 'నేను' సదా ఏదో కోరుకుంటూ ఆశాజీవి అయి ఆధిక్యతతో ఉండటం గానీ లేకుంటే అధికారుల ప్రాపు కోరుకుంటూ గానీ ఉంటుంది.

ఆలోచన మానసిక కాలాన్ని సృష్టిస్తుంది. మనిషిని నిబద్ధిస్తుంది. అభూత కల్పనలూ చేస్తుంది. నమ్మకాలు కల్గిస్తుంది. భావాలనేర్పరుస్తుంది. సంకుచిత విలువల నేర్పరుస్తుంది. భద్రతను కాంక్షిస్తుంది. తనను తాను మరచిపోవటానికి యితరులతో తాదాత్మ్య మొందేట్లు పురికొల్పుతుంది. తేడాల నెన్నుతూ సమస్యలను గూడ సృష్టిస్తుంది. భయం కలిగించి, సమస్యలను విశ్లేషించి పరిష్కరింప యత్నిస్తుంది. ఈ విధంగా 'నేను'కు కేంద్రమైన ఆలోచనల పోకడల నన్నింటనీ వెలికి తెచ్చారు కృష్ణమూర్తి.

ఆలోచన భౌతిక విషయపరంగా ఎంతో శక్తివంతమైంది. ఎంతో శాస్త్ర సాంకేతిక విజ్ఞానాలకు దారితీసింది. తిరిగి ఆ ఆలోచనే ఇతరులతో మనిషేర్పరచు కుంటున్న సంబంధాలను ఎలా కలుషితం జేస్తున్నదో, సహజంగా మనసుకు మెదడుకూ ఉన్న సామర్థ్యాలను కోల్పోవటానికెలా కారణభూత మవుతున్నదో చూద్దాం.

## మనసు (Mind)

మెదడు పరిణామ స్వరూపం మెదడనే యీ పరికరం అనుభవాలను ముద్రించుకుని, భద్రపరుస్తూ, మనస్సుఅనబడు తుంది. అంటే మనసు గతానికి ప్రతినిధే గాక ఫలితంగూడా. ఈ మనసు ఆలోచనలను నిర్వహించి తత్ఫలితమైన భావనల ననుసరించి కార్య నిర్వహణ జేస్తుంది. ఆలోచన లెక్కలేనన్ని 'నిన్న'ల ఫలిత మంటారు. కృష్ణమూర్తి. మరొక విధంగా చెప్పాలంటే మనసే ఆలోచనల మయం.

మనసు దాని ఆలోచనల్లో, ఇతరులు చెప్పేది వినడంలో, వినేవాటిని పర్య వేక్షించటంలో మునిగి తేలుతూ ఉంటుంది. మనసు ఖాళీగా మాత్రం ఎప్పుడూ ఉండదు. ఎప్పుడైనా ఉన్నా పగటి కలలు కంటుంటుంది. ఏ ఆలోచనా లేకుండా ఉండాలను కుంటుంది గాని ఉండదు. ఎప్పుడూ ఏదో వ్యాపకంతో ఉండటం వలన

మరొకటి చేయలేదు. నిరంతర వ్యాపకంలో నున్న స్థితిని గ్రహించి నిర్వ్యాపకంగా ఉండాలను కుంటుంది. మానసిక శాంతికి ఎవరైనా, ఒక పద్ధతిని సూచించితే దాని ననుసరించి అభ్యాసం జేస్తుంది.

నిత్య జీవితంలో మనసు అనుభూతి నొందక తప్పదు. వర్షానికి, పాలిచ్చే అవుకు, వ్యాధిగ్రస్తుడైన తోటి మనిషికి, వంటా వార్పుకూ, గృహ శుభ్రతకూ, ఆట పాటలకూ మరెన్నో అనుభవాలకూ స్పందించాలి. కాని పిల్లలతో, సమస్యలతో, కుటుంబంతో తరతరాలకూ సరిపోయే విధంగా జీవనాన్ని సమకూర్చు కోవటంలో నిత్యమూ సతమత మవుతుంటుందీ మనస్సు. నిరంతరం అవిశ్రాంతంగా ఆలోచనల్లో ఒకదానినుండి మరొక దానికి కదులుతూ తదనుగుణంగా భావనలతో కార్యక్రమాల నేర్పరచు కుంటూ ఉంటుంది.

ఏ వ్యాపకమూ లేనప్పుడు యీ మనసుకు సర్వమూ కోల్పోయినట్లు భీకరమైన ఒంటరితన మావరిస్తుంది. ఈ ఒంటరితనపు వేదన నుండి బయట పడేందుకు మనసెప్పుడూ ఏదో ఒక వ్యాపకాన్ని తిరిగి కల్పించు కుంటుంటుంది. నిరంతర వ్యాపకం, ఒకేరకమైన వ్యాపకం మనసును నిస్సత్తువగా కఠినంగా జేస్తాయి.

## జ్ఞానం (Knowledge)

ప్రతి రంగంలోనూ ఇనుమడిస్తున్న జ్ఞానం మనిషిని తబ్బిబ్బు జేస్తున్నది. పదార్థాన్ని ప్రపంచాన్ని విశ్వాన్ని గురించిన భౌతిక జ్ఞానం, శాస్త్రీయ గణిత సంబంధమైన శాస్త్రీయ జ్ఞానం, దేశాలు జాతులు వర్గాలను గురించిన సామాజిక జ్ఞానం మాత్రమే గాక అదనంగా తన గురించి గూడా మనిషి ఎంతో జ్ఞానాన్ని సమకూర్చుకున్నాడు.

మనసనేది మనిషి స్వంతంగా ఏర్పరచుకున్నదే గాక తరతరాలుగా సమకూరిన జ్ఞానార్జన ఫలితం గూడా, శాస్త్రవేత్త, తత్త్వవేత్త, పండితుడు అందరూ జ్ఞానార్జన చేస్తారు. మానవులంతా జ్ఞానాన్నారాధిస్తారు. ప్రపంచంలో ఎన్నో అద్భుతాలను యీ జ్ఞానం సృష్టించింది. వేగంగానూ సుఖంగానూ ప్రయాణించటానికి, విషయ సమాచారా లందించ టానికీ, తక్కువ కాలంలో ఎక్కువ వస్తువును తయారు చేయటానికీ, కాలాన్ని శక్తినీ పొదుపు చేసుకోగల పలు సౌకర్యాలకూ మూలమీ జ్ఞానం. జీవితంలో జ్ఞానానికున్న ప్రాధాన్యతను, పాత్రను కృష్ణమూర్తి కనుగొన్నారు. లౌకిక జీవితంలో జ్ఞాన మవసరమే నంటారు.

మనిషి తన అనుభవాన్నుండి జ్ఞానాన్ని పొందుతాడు. ఈ అనుభవం మెదడు కణాలలో జ్ఞాపకంగా నిలిచి ఉంటుంది. ఆ జ్ఞాపకం ఆలోచనకు మూలమవుతుంది.

ఆ ఆలోచన నుండి చర్య జరుగుతుంది. జరిగిన చర్య నుండి మనిషి మరికొంత నేర్చుకుంటాడు. ఇది చర్విత చర్వణ మవుతుంది. ఇలా మెదడు జ్ఞానంతో నిబద్ధ మవుతుంది. ఈ నిబద్ధమైన మెదడు స్వచ్ఛమైన దృష్టిని, సంపూర్ణ దృష్టిని నిరోధిస్తుంది. నిత్య నూతనమైన జీవితంలో, పరస్పర సంబంధాలలో జ్ఞానము అవరోధమై నిలుస్తుంది. భాష నేర్చుకోవటానికి, వ్రాయటానికి, కారు నడపటానికి, సాంకేతిక జ్ఞానాన్ని సంపాదించి తదనుగుణంగా ఏ పనైనా చేయటానికీ తప్పక జ్ఞాన మవసరమే. వివిధ జాతుల వారి, వర్గాల వారి జీవిత విధానాల గురించిన చారిత్రక జ్ఞానం గూడ మానవాళి వికాసాన్ని గురించి, వాని భవిష్యత్తును గురించీ ఒక విశాల దృష్టి నేర్పరచు కోవటానికి తోడ్పడుతుంది. మనిషికి తన గురించిన జ్ఞానమవసరమే. కాని తనకున్న జ్ఞానాన్ని గురించిన ఆలోచన కొందరిని అధికులుగానూ, కొందరిని అల్పులుగానూ భావించేట్లు జేస్తున్నది. కేవలం జ్ఞానం అహంభావాన్ని పెంపొందింప జేస్తున్నది. కేవలం జ్ఞానం వలన వివేకం రాదని జ్ఞాన సముపార్జన కంటే వివేక మవసరమనీ కృష్ణమూర్తి అంటారు. విచక్షణ లేని జ్ఞానం తన స్వంత విషయాలలో స్వలాభాలకు ఉపయోగపడుతుందేమో గాని సమాజానికి ఉపయోగపడదు. "జ్ఞానం ప్రజ్ఞకు సాటిగాదు,......... జ్ఞానం ప్రజ్ఞ నందుకోలేదు. ప్రజ్ఞ జ్ఞానాన్ని ఉపయోగించుకుంటుంది" అంటారు కృష్ణమూర్తి.

వీరు ప్రపంచంలో బహుముఖాభివృద్ధికి మూలమైన జ్ఞానాన్ని అనుభవాల ఫలితమైన యీ శాస్త్ర సాంకేతిక జ్ఞానాన్ని ఎంతో మెచ్చుకుంటారు. అంతకు మించిన స్వస్వరూప జ్ఞానాన్ని గూడా పొందమంటారు. ప్రతి ఒక్కరినీ మానవాళితో తనకున్న సంబంధాలలో తన మానసిక పోకడలు ఎలా వున్నదీ పరిశీలించుకోమంటారు. మనిషి తన మానసిక పోకడల గురించి పరస్పర విరుద్ధమైన కోరికల గురించీ, ప్రయత్నాల గురించీ, ఆశల గురించీ, భయాల గురించీ తెలుసుకున్నప్పుడు 'నేను'ను అధిగ మించగలడు. అంతేగాక ఇతరులు, సమాజం, ప్రపంచం తననుండి వేరుగాదని గూడా గ్రహిస్తాడు. ప్రపంచంలోని హింస, కోపం, భయం, దుఃఖం, సంఘర్షణ యిత్యాది వాటిని తన వంతుగ ఎంత చేరుస్తున్నాడో గూడా గ్రహిస్తాడు. అజ్ఞానమంటే కేవలం జ్ఞానం లేకపోవడమే కాదు. స్వస్వరూప జ్ఞానం లేకపోవటం గూడా!

స్వస్వరూప జ్ఞానంలో విశ్వమంతా యిమిడి ఉంది. ఇట్టి జ్ఞానం మానవాళి ప్రయాస లన్నింటినీ ఆకళింపు జేసుకుంటుంది అంటారు కృష్ణమూర్తి. అందుచేత మనిషి మంచి సంబంధ బాంధవ్యాలతో జీవించటానికి ప్రధానంగా స్వస్వరూప జ్ఞాన మవసరం.

సౌఖ్యప్రదమైన, విజయవంతమైన దైనిక జీవితాన్ని గడపటానికి శాస్త్ర సాంకేతిక జ్ఞానాన్ని ఆర్జించటం ముఖ్యమేనంటారు. కాని మనుష్యులను ఎన్నోరకాలుగా

విభజించి ఒకరినొకరికి దూరం జేస్తున్న సంబంధ బాంధవ్యాలలో పేర్చుకుంటున్న జ్ఞానం మాత్రం వేదనను పెంచుతున్న అజ్ఞాన స్వరూపమే గాని వేరు గాదంటారు.

ఆర్జించిన అనుభవాల నుండి పుట్టిన ఆలోచన మెదడును నియంత్రిస్తుంది. ఆత్మ పరిశీలనను ఆటంకపరుస్తుంది. ఇట్టి ఆటంకం లేనప్పుడే మనసు తాజాగా స్వచ్ఛంగా, ఆరోగ్యంగా ఉంటుంది. ఈరకమైన మనసున్న మనిషి సాంకేతిక జ్ఞానంతో వ్యవహరించవలసి వచ్చినప్పుడు నిస్వార్థంగా, నిస్సంకోచంగా, పవిత్రంగా ఉండగలడు. స్వేచ్ఛకు ఆరంభం స్వస్వరూప జ్ఞానం, తనను తాను తెలుసుకున్నప్పుడు సక్రమతనూ, శాంతినీ తీసుకురాగల డంటారు కృష్ణమూర్తి.

సాంకేతిక రంగంలో చేపట్టిన కార్యాలను సక్రమంగా నిర్వహించటానికి జ్ఞానం జ్ఞాపకం అవసరం. కాని జ్ఞాపకాల బరువుతో మనిషి కోమలత్వాన్ని కోల్పోయి భావ రహితుడవు తున్నాడు. గొప్ప పరిణామ ఫలితమైన యీ కోమలత లేకపోవటం వలన తన మెదడుకున్న పూర్తి శక్తిని వినియోగించు కోలేక పోతున్నాడు.

మానసిక రంగంలో పూర్వానుభవాల ప్రభావంతో వర్తమాన జీవితానికి స్పందించే మనిషి స్వచ్ఛంగా కొత్తదనంతో జీవించలేడు. చేసిందే చేస్తూండటం వలన మెదడులోని కణాలన్నింటినీ ఉపయోగించే అవసరం లేకపోవటం వలన అదీ కృశించిపోతుంది.

భద్రత నాశించే మనిషి ఎంతగా జ్ఞానార్జనకు ప్రాకులాడుతున్నాడో, అది ఏవిధంగా సంఘర్షణకు భద్రతా లేమికీ దారితీస్తున్నదో చూపుతారు కృష్ణమూర్తి. యుద్ధానికీ ఆందోళనకూ మూలం 'నేను' గాని శాస్త్ర సాంకేతిక జ్ఞానమే మాత్రమూ గాదంటారు. భౌతిక ప్రపంచాన్ని గురించిన జ్ఞానం, మానవ సంబంధాల గురించిన జ్ఞానం - ఆ సంబంధాలను పెంచుకోవటానికో, త్రుంచు కోవటానికో ఉపయోగించే జ్ఞానం - అన్నీ చేతనలోని భాగాలే - చేతనలోని విషయాలలో సమన్వయం సాధించి సంబంధ బాంధవ్యాలను సర్దుబాటు జేసుకోమంటుంది మానసిక శాస్త్రం. కాని చేతనలోని విషయాలను పూర్తిగా ఖాళీ జేసినప్పుడే మానవ సంబంధాలు సవ్యంగా వుంటాయంటారు కృష్ణమూర్తి. అంటే సాంకేతిక విషయ జ్ఞానపు ఆవశ్యకతను గుర్తించి, ఉపయోగిస్తూ మానవ సంబంధాలలో జ్ఞానం ఏవిధంగా అవరోధమయిందో చూసి చేతనను ఖాళీ చేయటమే కృష్ణమూర్తి మానవాళికిచ్చిన సందేశం. జీవితంలో జ్ఞానానికి ఇవ్వవలసిన స్థానాన్ని మాత్రమే యిచ్చినప్పుడు అదెంతో విలువైన దవుతుంది. అంతేగాక తన గురించి తెలుసుకుంటూ ఆ జ్ఞానాన్ని మెదడులో నిలువనీయక అంతం చేస్తుండటం వలన సంఘర్షణ నుండీ, దుఃఖాన్నుండీ, హింసనుండీ స్వేచ్ఛనొంది పరిపూర్ణ మూర్తిమత్వాన్ని సంతరించుకుని తనకున్న శక్తి నంతటినీ మనిషి వివిధ రంగాలలో

సవ్యంగా ఉపయోగించుకో గలడు.

విద్యారంగంలో జ్ఞానార్జనకు అత్యంత ప్రాముఖ్యత ఇవ్వబడింది. అందువలన ప్రజ్ఞ, సృజనాశక్తి ప్రేమలు అశ్రద్ధ జేయబడ్డాయి. లౌకిక జీవనానికి, విధి నిర్వహణకు జ్ఞానమవసరమే అయినా జ్ఞానమే అంతా గాదంటారు కృష్ణమూర్తి. జ్ఞానం, జ్ఞాపకం ఆలోచన వంటి కొన్ని శక్తులను మాత్రమే పెంపొందించే ప్రయత్నంలో ప్రజ్ఞను, సృజనాత్మకతను అశ్రద్ధజేయక విద్యార్థులను సంపూర్ణ మానవులుగా తయారు జేయాలి. వీరు కేవలం మంచి ఉద్యోగం (బాగా సంపాదించిపెట్టే) సంపాదించుకునేందుకే నిబద్ధమవకుండా అందరితోను మంచి సంబంధాల నేర్పరచుకుని జీవించటానికి తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు ప్రోత్సహించాలి.

కృష్ణమూర్తి స్వస్వరూప జ్ఞానాన్ని పొందటమే విద్యంటారు. అంటే ప్రతివాని లోను యిమిడివున్న ప్రపంచాన్నర్థం చేసుకోవడం - కేవలం ఉపాధ్యాయుల నుండి పుస్తకాల నుండి అభ్యసించటం గాదు. తన కెదురయ్యే సమస్యలను తనకు తానుగా విచక్షణ తతో, ఏ నమ్మకం మీదా ఆధారపడకుండా అర్థం చేసుకోవడం. పుస్తకాలు ముఖ్యమైనవే గాని అంతంలేని తన కథను తాను తెలుసుకోవటం మరెంతో ముఖ్యం.

## జ్ఞాపకము (Memory)

మెదడనే పరికరం తన అనుభవాలను ముద్రించుకుని ఆ అనుభవాలను ధారణజేసి స్ఫురణకు తెచ్చుకునే శక్తే స్మృతి. స్మృతి ఆలోచనకు జన్మనిస్తుంది. భూత భవిష్యత్తులకు సంబంధించిన ఆలోచనలు, ఆశలు, ఆశయాలు, జ్ఞాపకాలవుతాయి. మనమెదడులోని కణాలలో, భూతకాలానుభవాలు, వాటి స్మృతులు కోట్లాది సంవత్సరాల జ్ఞానం యిమిడి ఉంటాయి. కృష్ణమూర్తి 'మెదడంటే స్మృతులే' అంటారు.

మనుషుల గురించి గాని వస్తువుల గురించి గాని అనుకూలంగానూ ప్రతి కూలంగానూ వచ్చిన జ్ఞాపకాలు వర్తమానంలో ఏర్పరచుకునే సంబంధాలను ప్రభావితం జేస్తాయి. అంటే మనుష్యుల మధ్య సంబంధాలు వారి మధ్యగాక వారి జ్ఞాపకాలపైనే ఆధారపడతాయి. వారి మధ్య గాదు! 'జీవించటమనే కళలో జ్ఞాపకాలకు తావులేదు. జ్ఞాపకాలపైనే పూర్తిగా ఆధారపడని, సూటియైన, సరైన సంబంధాలు గల్గి ఉండటమే జీవిత కళ' అంటారు కృష్ణమూర్తి.

భౌతిక జీవిత రంగంలో పరిశోధించి, రూఢియైన సత్యాలను జ్ఞాపకముంచు

కోవడమెంతో అవసరం. వైజ్ఞానిక సాంకేతిక శాస్త్రాలు ఈవిధంగానే పురోభివృద్ధి జెందాయి. కంప్యూటర్లు పనిచేయటం ప్రారంభించేది వాటి జ్ఞాపకాలనుండే. మనిషి గూడా కేవలం తన జ్ఞాపకాల నుండే వ్యవహరిస్తుంటే అతనికీ కంప్యూటరుకూ భేదమే మున్నది? కృష్ణమూర్తి భౌతిక జీవిత రంగంలో జ్ఞాపక శక్తికి ఉన్న పాత్రను కాదనలేదు. కాని మానసిక జీవితంలో జ్ఞాపకాలెలా మానవ సంబంధాలపై అధికృత వహించినదీ సృజించే శక్తిని నిర్వీర్యం జేసినదీ, పలు సుఖాలనాశిస్తూ ఎలా బాధించేదీ చూపుతారు. స్మృతి చేసే యీ వినాశనాన్ని స్పష్టంగా గ్రహించగల్గినప్పుడు మనసు తేలికై మానవ సంబంధాలు స్వచ్ఛమై సులభమై వర్తమానంలో స్వచ్ఛంగా జీవించటానికి మార్గం వేసినట్లే. ఈ మార్గాన్వేషణలో సఫలీకృతుడైన వానికి భూతకాలపు బరువు పోయి భౌతిక రంగంలో స్మృతి అద్భుతంగా ఉండి సృజనాత్మక శక్తి పెంపొందుతుంది.

## ఆలోచన (Tho:ght)

ఆలోచనాశక్తి మనిషికి ఎంతో అధికారాన్ని తెచ్చిందన్న తలంపేగాని మనిషి జీవితంలో ఆలోచనా శక్తి ఎలాంటిపాత్రను నిర్వహించిందో గణింపలేదు. అమోఘమైన సాంకేతిక నిపుణత అభివృద్ధి గావటానికి మనిషి ఆలోచనా శక్తి కారణమని గర్వంగా పరిగణింపవచ్చు. ఆలోచన నిర్వహించే పాత్ర యొక్క స్వరూపాన్ని ఆసాంతమూ గ్రహించి మానవ సమస్యలకు ఆలోచనే మూలమని గ్రహించిన కృష్ణమూర్తి సూచించిన పరిష్కారం - ఆలోచనను అంతం చేయటం.

'ఆలోచన సంఘర్షణను సృష్టిస్తుంది. ఆ ఆలోచనే దీనిని పరిష్కరించటానికీ ప్రయత్నించి విఫలమవుతుంది'. దీన్ని వాస్తవంగా గ్రహించటం మన నొక్కమారు ఆలోచన పూర్తి స్వరూపాన్ని చూసేలా చేస్తుంది. ఆలోచన చేస్తున్న దేమిటో గ్రహించితే కృష్ణమూర్తి చెప్పినట్లు అవసరం లేనిచోట దానినంతం జేయగలం. జరిగిన దానిని మెదడులో జ్ఞాపకంగా దాచి, జరగబోయే దానిని దృష్టిలో ఉంచుకుని వర్తమానంలో ఏదైనా చేయటానికి మనిషి సంకల్పిస్తాడు. అంటే అసలీ ఆలోచనన్నదే నశించిన భూతకాలానికీ ఊహించిన భవిష్యత్తుకూ సంబంధించింది.

ఆలోచనను కేవలం ఒక నాడీమండల సంబంధమైన ప్రక్రియగానో, ఒక రసాయనిక ప్రక్రియగానో పరిగణింపక యాంత్రికమైన నిరుత్సాహ దృష్టితో చూడక మానసిక కాలాన్ని సృష్టించే ప్రక్రియగా మానసిక రంగంలోకి తెచ్చారు కృష్ణమూర్తి.

ఇప్పటి విద్య యాంత్రికమైన బుద్ధి జ్ఞానాలను మాత్రమే పెంపొందించే ప్రయత్నం జేస్తున్నది. నిత్య జీవితంలోను, సాంకేతిక విషయాల్లోనూ జ్ఞాపకము ఆలోచనా అవసరమే. జ్ఞాపకాలకే బానిసయి నిబద్ధమయిన మనసున్నప్పుడు మనిషి సవ్యమైన ఆలోచన చేయలేడు. భూత భవిష్యత్కాలాల నుండి స్వేచ్ఛనొందినప్పుడే నిస్వార్థమైన, నిష్పాక్షికమైన ఆలోచన చేయగలడు. అంటే ఆలోచించేవాడు 'నేను' అన్న కేంద్రం లేనప్పుడే అట్టి ఆలోచన సాధ్యమవుతుంది.

జ్ఞానానికి, జ్ఞాపకానికి ఆలోచనకు ఉన్న స్థానాన్ని అర్థం చేసుకోవాలంటే సూటిగా, స్థిరంగా, వాస్తవంగా చూడగలగాలి. పిల్లలకు మానసిక స్వేచ్ఛవున్నప్పుడు వారు జీవితాన్ని వాస్తవ దృష్టితో చూడగలరు. అప్పుడే వారు పెద్దలను పుస్తకాలను గతానుభవాలను అనుసరించకుండా తమకుతామే అర్థం జేసుకోగలరు. సవ్యమైన విద్య దేనికీ నిబద్ధ మవకుండా తమకు తాముగానే ఆలోచించేట్లు చేస్తుంది. తనకుతానుగా జేసిన ఆలోచనలో అపరిమితమైన నమ్మకమూ కుదురుతుంది. అప్పుడతడు బానిసగాడు. సృజించే మనిషి అంటారు కృష్ణమూర్తి.

ముందుగా ఆలోచనల పోకడలను గమనిద్దాం.

## మానసిక కాలము (Psychological time)

ఆలోచనకు మూలం అనుభవం. అంటే గతంలో జరిగింది. ఆలోచనల కదలిక 'నిన్న'లో గాని 'రేపు' లో గాని వుంటుంది. కృష్ణజీ కాలాన్ని రెండుగా విభజించారు. ఒకటి గతించిన కాలం - నిన్న, తర్వాత నిముషం, రేపు ఆ తర్వాత అనే గడియారపు కాలం. అంటే ఒక విత్తనం చెట్టవటానికి, పసిబిడ్డ పెద్దవటానికి ఎడ్లబండి జెట్ విమాన మయే మార్పురావటానికి అవసరమయే కాలం. ఇది పెరుగుదలకు సంబంధించింది. మరొకటి అంతరంగపు టాలోచనా ఫలితమైన మానసిక కాలం. అంటే ఆలోచనల వల్ల నిన్న నేడు రేపుగా నున్న మరో ప్రమాణమే మానసిక కాలం. ఉదా : 'నేనలా చేసిఉంటే బాగుండేది''నన్నతడు బాధించాడు' అన్నది మానసిక భూతకాలం. 'నేనేవిధంగా ప్రవర్తించాలి'. 'నేనొక గొప్పవాడిని కావాలి' అన్నది భవిష్యత్కాలానికి సంబంధించింది. ఈవిధంగా ఆలోచన మానసిక కాలాన్ని సృష్టించింది.

మానసిక కాలం ఆలోచనల ఫలితమనీ, జరిగిపోయిన దానికీ జరగాలనుకున్న దానికీ మధ్యనున్న వ్యవధే మానసిక కాలమని, మానసిక కాలంలో జరిగే పోరాటం మనసును నిరంతరం రొదపెట్టేట్లు జేస్తుందనీ అంటారు కృష్ణమూర్తి. మనమొక్క సారి

ఆగి మనసును పూర్తి ధ్యాసతో పరిశీలిస్తే ఆలోచనే మానసిక కాలమన్న కృష్ణమూర్తి వాక్కు సత్యమనితోస్తుంది.

రేపు అన్నది మనిషికెంతో ముఖ్యం. అతడికున్నదానిలో అసంతృప్తిపడి లేనిదేదో తృప్తినిస్తుందని ఊహించుకుని, మరోరకంగా ఉండాలనుకుంటాడు మనిషి. మరొకరకంగా ఉండాలనుకునే ఇచ్ఛను ఆలోచనే రేకెత్తిస్తుంది. అలాగే జీవితాన్ని సూటిగా ఎదుర్కోక గతానుభవాలపై ఆధారపడతాడు. తాను నిత్యనూతనంగా ఉండే జీవితమనే స్రవంతిలోనే బ్రతుకుతున్నా భూత భవిష్యత్కాలపు ఆలోచనల్లో మునిగి ఉండటంలో వర్తమానాన్ని అశ్రద్ధజేసి నూతనత్వాన్ని కోల్పోతాడు.

ఒక భాషను గానీ, శాస్త్రాన్నిగానీ, గణితాన్నిగానీ నేర్చుకోవటానికి భౌతిక కాలమవసరమే నంటారు కృష్ణమూర్తి. కాని తన గురించి తాను తెలుసుకోవాలన్నప్పుడు మానసిక కాలం గతానికి సంబంధించిన ఒక బరువుగానూ, వర్తమానంలో నిలువక భవిష్యత్తులోనికి పారిపోయే మార్గంగానూ, యదార్థ జ్ఞానానికి దూరం జేసేదిగానూ గుర్తించి యీ మానసిక కాలాన్ని అంతం జేయమంటారు.

స్మృతులు, అనుభవాలు, ఆశలు, ఏరోజు కారోజు ఏక్షణానికాక్షణం అంతమయి నప్పుడు భూతకాలపు భారాన్నుండి బయటపడవచ్చు. కోరిక నుండి స్వార్థపూరిత జీవితాన్నుండి మొత్తం మానసిక గతాన్నుండి స్వేచ్ఛ నొందవచ్చు. మానసిక కాలమంత మొందించటంతో అవన్నీ తుడిచిపెట్టబడినప్పుడు మానసిక నిశ్శబ్దతలో సృష్టి జరుగుతుంది.

మానసిక కాలమంతమయినప్పుడు ఎంతో శక్తివృధాగాకుండా మిగులుతుంది. అట్టి మనసే అపరిమితం ఆ శక్తినే కృష్ణమూర్తి 'ప్రజ్ఞ" అంటారు. ఆ ప్రజ్ఞ సవ్యమైన పనులు చేపట్టే ఆలోచన చేయగలదు.

## నేను('I')

'నేను' అనే ఆలోచనే విభజనకు నాంది' అంటారు కృష్ణమూర్తి. 'నేను' అనే కేంద్రం సదా చురుగ్గా పనిజేస్తుంది. ఈ "నేను" పలురకాలైన పేర్లతో శారీరక మానసిక ఛాయలతో వివిధ ఉద్యోగాలతో సమాజంలో పలుస్థాయిల్లో ఉంటుంది. సాంఘికంగా ఆర్థికంగా, ధార్మికంగా ఒకరిని యజమానిని మరొకరిని సేవకుని జేస్తుంది.

ఈ రకమైన 'నీవు' 'నేను' అనే విభజనకు బాధ్యురాలు ఆలోచనే. మనిషిని స్వార్థంతో ఆలోచించేట్లు చేస్తుంది. 'నేను'కు కేంద్రం 'నాకు' అన్నదై మానవాళిని

సాధ్యమైనన్ని విధాలుగా దేశాలని మతాలని జాతులని సమాజాలని విభజిస్తుంది. 'నాకు' అన్న భావన తనను తాను తృప్తి పరచుకోవటానికే గాని ఇతరుల కోరికల నెప్పుడూ లెక్కజేయదు. 'నేను' 'నాకు' అన్న కేంద్రం నుండే పనులన్నీ జరుగుతాయి.

మనిషి తనను తానర్థం జేసుకున్నప్పుడు విభజనకు బాధ్యురాలైన ఆలోచన యొక్క స్వభావాన్నే గాక 'నేను' అన్న కేంద్రం నుండి అది ఎలా పనిజేస్తుందో గూడా తెలుస్తుంది. దాని కదలికలను, విరుద్ధమైన స్వభావాన్ని గమనిస్తే దాని కథను అదే చెప్పగలదు.

## ఒంటరి తనం (Isolation)

'నేను' అన్న భావనపై కేంద్రీకృత మయినప్పుడు మనిషికెంత ఒంటరి తనమనిపిస్తుందో కృష్ణమూర్తి వివరిస్తారు. మనిషేర్పరచుకున్న నిబంధనలు, ప్రభుత్వం, మతాలు ఏదో ఒకవిధంగా విభజనకు ప్రోత్సహిస్తాయి. శతాబ్దాల తరబడి ఒక మనిషికి వ్యతిరేకంగా మరొక మనిషి, ఒక సమూహానికి వ్యతిరేకంగా మరో సమూహం, ఒక దేశానికి వ్యతిరేకంగా మరోదేశం నిలుస్తూ మానవ పురోభివృద్ధికి ఆటంకమవుతున్నాయి. పలురకాలైన విభజనల కారణంగా మనిషి ఏదో ఒకదానిని నాశనం జేస్తూ ఆపై విచారిస్తూ వున్నాడు. కష్టాల్లో మనుషులు దగ్గరైనా ఆ ఆపద తప్పిపోగానే ఎప్పటిలాగా దూరమవుతున్నారు. 'నేను' అన్న భావన మనిషిని ఒంటరిగాజేసి ఆ ఒంటరి తనాన్ని తప్పించు కోవటానికి ఇతరులకు చేరువ జేస్తుంది.

## సన్నిహితమవడం (Attachment)

ఒకప్రక్క విభజించి వేరుజేసి ఒంటరియైన 'నేను' మరొకవంక యితరులతో బంధ మేర్పరచుకోవటానికి తహతహలాడు తుందంటారు కృష్ణమూర్తి. ప్రతిమనిషీ తన పిల్లలకో, భార్యకో, భర్తకో, ఆస్థికో, కీర్తికో, సాంప్రదాయానికో, పనికో, మనుషులకో, భావాలకో, అనుభవాలకో, తాను అన్నమాటకో కట్టుబడి ఉంటాడు. ఇవి తనలోని శూన్యతను తప్పించుకునేందుకు మార్గాలవుతాయి. మనిషి ఒకరికి సన్నిహిత మయ్యేందుకు మరొకరికి దూరమవటం, పోట్లాడడం, వ్యతిరేకించటం జేస్తాడు. ఆందోళనను, అసహ్యాన్ని, యీర్ష్యను పెంచుకుంటాడు. బిడ్డలు తల్లిదండ్రులకు, విద్యార్థి ఉపాధ్యాయునికి కట్టుబడి వారు చెప్పినవే పాటిస్తూ స్వతః శక్తిని కోల్పోతుంటారు. ఈ

కాలంలో పెద్ద సమస్యలయిన లైంగికత్వం గూడా ఒక విధమైన సాన్నిహిత్యాన్ని కోరుకోవటమే. మానవ జీవితంలో లైంగికతకు ఒక స్థానమున్నా మనసు దానికే అత్యంత ప్రాధాన్యత నిచ్చినప్పుడు అదొక సమస్యవు తుందంటారు కృష్ణమూర్తి.

మనిషికి భౌతికావసరాలుండటం సహజం. అవెప్పుడైతే అత్యధిక ప్రాముఖ్యత వహిస్తాయో అప్పుడు జీవితార్థాన్ని కోల్పోవటం జరుగుతుంది. ఆకలయినప్పుడు తినటం సమస్యగాదు. అది సమస్యెప్పుడవు తుందంటే రోజంతా మరొక ఆలోచన లేకుండా తిండి గురించే ఆలోచిస్తున్నప్పుడు! అదేవిధంగా ఒకదాని గురించి నిరంతరం ఆలోచిస్తున్నప్పుడు అది సమస్యగా పరిణమిస్తుంది. చాలామంది లైంగిక సంబంధాలను మరీ మరీ కోరుకుంటూ ఆ ఆలోచనల్లో మునిగిపోతుంటారు. మ్యాగజైను కథలు, సంగీతం, అర్ధనగ్నమైన అపసవ్యమైన వస్త్రధారణ ఇలాంటి వెన్నో లైంగిక పరమైన ఆలోచనలను కలిగిస్తాయి. ఇవి అందరి దృష్టినీ ఆకర్షించి సహజంగా కుతూహలమున్న యువకులను అనుభవాల్లోకి లాగుతాయి. ప్రస్తుతమీ లైంగిక లాలసతే ఒక పెద్ద సమస్య. బాధాతప్త మానవాళికి దురదృష్టవ శాత్తూ లైంగికత ఒక్కటే ఓదార్పయింది. 'నాది' అన్నది లేకపోవటమే లైంగికతలోని అందమంతా' నంటారు కృష్ణమూర్తి, అధికారం, ఆధిక్యతలలో నలిగిపోతున్నా మనిషి లైంగికానందంలో తననుతాను మరువ గలడు కనుకనే దానికి అత్యంత ప్రాముఖ్యత నిస్తున్నాడు. 'నేను' 'నాకు' - నుండి లభించే స్వేచ్ఛకు ఇదొక్కటే మార్గం గాబట్టి మనిషి లైంగికానుభవాన్ని పదేపదే కావాలను కుంటున్నాడు కాని యీస్వేచ్ఛ తాత్కాలికమే!

## కోరిక (Desire)

మనిషి అందమైనదాన్ని చూస్తాడు. ఇంద్రియజ్ఞానం పొందుతాడు. చూసింది తనకు లేదని తోస్తుంది. తనకు లేకపోవటంతో కావాలన్న కోరిక గలుగుతుంది ఈ కోరికకు మూలం నాకు లేదు. నాకూ కావాలి' అనే ఆలోచనే, ఇలాకావాలను కోవటం, ప్రయత్నించడం, పొందటం అలాగే తానొకరకంగా ఉండాలను కోవటం, ఉండేందుకు ప్రయత్నించటం, విరుద్ధభావాలు గలగటం 'నేను' అన్న భావనను వృద్ధి జేస్తాయి.

కోరిక ఆలోచనలకు ఒక రూపాన్ని పరిధిని ఏర్పరుస్తుంది. ఆలోచనా శక్తిని కోరికల కదలికలు సంకుచిత పరుస్తాయంటారు కృష్ణమూర్తి. మనిషిలో రెండు రకాల కోరికల్ని చూడొచ్చు. భౌతికావసరాలను తీర్చుకునే ప్రయత్నంలో ఉద్భవించిన కోరికలు. ఇవిగాక మనిషి భవిష్యత్తుకై అభివృద్ధి సాధించాలని చేసే ఆలోచనలు

రెండోరకానికి చెందినవి. ఇతరుల కున్నవి తనకూ కావాలనుకోవటం. వారి కంటే తనకే ఎక్కువ కావాలనుకోవటం గూడా జరుగుతుంది. మనిషి కీర్తికోసం ఎన్నెన్నో పొందాలను కుంటాడు. అవసరాలు అత్యాశలై ఎన్నో కావాలని కోరుకుంటాడు. తన సంపాదన తననే బానిసగా జేసుకుంటుందన్న వాస్తవాన్ని గమనించడు. మానసిక మైన కోరికలు అనంతం. మనిషి భద్రతను గానీ, సుఖమయ జీవితాన్ని గాని, నైపుణ్యతను గాని కోరుకుంటూనే ఉంటాడు. తన పిల్లలుగాని, భార్య గాని భర్తగాని తానుకోరుకుంటున్నదే కోరినప్పుడు వారితో గూడా పోటీపడి వారినేమాత్రం పట్టించుకోనంత స్వార్థపరుడు గూడా అవుతాడు.

## ఆదర్శాలు (Ideals)

ప్రసిద్ధమైన ఆదర్శాలను, గొప్పగొప్ప ఉద్దేశాలతో నున్న ఆదర్శాలను పదే పదే గుర్తుతెచ్చుకుంటూ వీటిని ఆచరించమని చెప్తూనో, ఆచరించే ప్రయత్నం జేస్తూనో ఉంటాం. 'ఆదర్శం వాస్తవాన్ని జరుగుతున్న దానిని కలుషితం జేస్తుంది.' అంటే వాస్తవికతను చూడనీయకుండా కల్పనవైపు దృష్టిని మళ్ళిస్తుంది. యదార్థాలపై ఆదర్శాలు రుద్దబడతాయి. అంటే జరుగుతున్న దానిని జరుగుతూ ఉండవలసిన ఆదర్శానికి కట్టుబడి ఉండేట్లు మార్చివేస్తాయి. వాస్తవంగా జరిగేదాని నుండే ఊహాలోకం ఏర్పడినా ఆదర్శవంతం జేయబడిన దానికి కట్టుబడి ఉండటం కోసం యదార్థాన్ని త్యాగంచేస్తుంది. వేనవేల సంవత్సరాలుగా జరుగుతున్నదిదే. ఉన్నదానిని కాదనడం, యదార్థానికి దూరమవటం మనసును భ్రష్టం జేస్తాయి. అంటే భావాల నుండి, నిర్ణయాల నుండి ఆశ నుండి పుట్టిన ఆదర్శాలు మనసును చెడగొడతాయి.

## ఆకాంక్ష (Ambition)

'నేను' కున్న ఆకాంక్షలే అప్పటి సంబంధాలను సమకూర్చు తుంటాయని నొక్కి చెప్తారు కృష్ణమూర్తి. ఆశ అసూయలు, అధికారం, సమాజంలో ఆధిక్యతనో గురుపీఠాన్నో పొందాలన్న ఆరాటమూ యీ సాంఘిక సంబంధాలను ఏర్పరుస్తాయి. గెలుపు గుర్తింపులనే కోరికలు ఎన్నో ఆకాంక్షలను గలిగిస్తాయి. ఈ ఆకాంక్ష ఎడ్ల బండి నుండి వ్యోమనౌక వరకూ సాంకేతికంగా ఎంత అభివృద్ధి జేసిందో మనకు తెలుసు. అంతేగాదు. మానసిక ప్రపంచంలో ఈర్ష్య, పోటీ, బాధ, ఆందోళన నిస్పృత్తువలకు గూడా ఆకాంక్షే మూలం. ముఖ్యంగా ఇది అభివృద్ధి చెందుతున్న దేశాల్లో చెప్పలేనన్ని దురవస్థలకు దారితీసింది.

# నిబద్ధత (Conditioning)

జీవితంలో మనిషెంత లోతుగా నిబద్ధుడయాడో పరిశీలించి మానవ జీవితంలో దాని ఫలితాన్ని, ఆధిక్యాన్ని కృష్ణమూర్తి చూపిన తీరు మనస్తత్వ శాస్త్రానికి, విద్యా రంగానికి ఎంతో విలువైంది. వేల సంవత్సరాల నుండీ జరిగిన యీ నిబద్ధతను వీరు కనుగొని యిది శారీరకంగానూ, భౌతికంగానూ, మానసికంగానూ, ఆలోచనా పరంగానూ జరిగిం దంటారు.

మానవుని శారీరక ప్రతిస్పందనలు అంతర్గత మానసిక పరిస్థితుల ననుసరించి ఉంటాయి. మనిషి శారీరక కార్యకలాపాలను క్రమ పద్ధతిలో నిర్వర్తిస్తాడు. అంతేగాక గతానుభవాల ప్రభావంతో మానసికంగా నిబద్ధుడయి వర్తమానంలో ఎదురయ్యే ప్రతి సవాలునూ ఆ గతానుభవంతోనే ఎదుర్కోవటానికి అలవాటు పడతాడు. అనుభవాల జ్ఞాపకాలు వాటి ద్వారా పొందిన సుఖం తిరిగి అవే కావాలనుకొనేలా జేస్తాయి. కాని మనిషి దానితోపాటున్న బాధాకరమైన అనుభవాలను మాత్రం తప్పించుకోవాలని చూస్తాడు. తనకు అలవాటైంది లభించనప్పుడు, తనకిష్టం లేనివి వదిలించు కోలేక పోయినప్పుడు ఎంతో ఆందోళన పడతాడు.

మనిషి లోతుగా నిబద్ధుడవటానికి సాంఘిక స్మృతులు ఎలా మూలమో పరిశీలించిన కృష్ణమూర్తి ఇలా అంటారు. 'మనం సంఘానికి నిబద్ధులం అంటే మనచుట్టూ ఉన్న సంస్కృతి మనల్ని నిబద్ధులను జేస్తుంది. ఆ సంస్కృతీ సాంప్రదాయాలకు, ఇతరుల జీవితాలకు, వారి సమస్యలకు, పరిష్కారాలకు అత్యధిక ప్రాముఖ్యత నిస్తాడు. మనిషి తన జీవితం తాను జీవించటానికి గాని, తన సమస్యల్ని పరిష్కరించు కోవటానికి గాని ఇతరులను అనుసరిస్తాడు. అనుకోని ఫలితాలను ఎదుర్కొన్నపుడు అనుభవజ్ఞుని దగ్గరకెళ్తాడు గాని అన్ని విషయాలనూ ఏ నిబద్ధతకూ లోనుగాకుండా అవగాహన చేసు కోవాలని ప్రయత్నింపడు. ఎవరో చెప్పింది వినటానికీ, నమ్మటానికీ, నేర్చుకోవటానికీ, తిరిగి బోధించటానికీ జీవితమంతా నిబద్ధుడయి ఉంటాడు. ప్రతిదీ మూసపోసి నట్లుండటం వలన తనలో జరుగుతున్న దానినీ, తనచుట్టూ జరుగుతున్న దానినీ సూటిగా తనకు తానుగాచూసి తెలుసుకునే అవకాశముండదు. పెద్దలు, సాంప్రదాయాలు మానవ జీవితాన్ని ఒక పంథాలో నడిపిస్తూ భవిష్యత్తుకొక మార్గాన్ని వేయ ప్రయత్నించటం వలన విశాల దృష్టితో విషయావగాహన చేసుకునే అవకాశముండదు. దీర్ఘకాలంగా ప్రోగుబడిన సాంప్రదాయం మెదడును నిబద్ధంచేసి

యాంత్రికంగా పనిజేయిస్తుంది. సూక్ష్మంగానూ విశాల దృష్టితోనూ పరికిస్తే నేటి మానవునికి పురాతన మానవునికి మధ్య భేదమేమీ లేదు.

ఒక్కమాటలో చెప్పాలంటే నశించిన గతమే మనిషి. మనిషి గతించాడు. గతించిన నిన్నలో బ్రతుకుతున్నాడు. తనతాత ముత్తాతల జీవితాన్నే జీవిస్తున్నాడు. అందుకే నూతనమైన వర్తమాన పుక్షణాల యదార్థ రూపాన్ని గ్రహింప లేక పోతున్నాడు. ఎన్నో రాజకీయ, మత, సాంఘిక విద్యాసంస్థలు మనిషి నిబద్ధతను పెంచి జడునిగా జేశాయి. ఇలా ప్రతి క్షణమూ ఒకనాటి గతంపైనో వేల సంవత్సరాల గతంపైనో ఆధారపడింది గనుక మనిషికి స్వచ్ఛమైన వర్తమాన జీవితమే లేదంటారు కృష్ణమూర్తి.

ఇలా గతం - అనుభవం - జ్ఞానం ప్రమాణాలుగా స్వీకరించి మనిషి తన జీవితాన్ని రూపొందించుకుంటున్నాడు. భద్రతకోసం పాత జ్ఞాపకాలెప్పుడూ మనిషి నొకగాటిలోనికి లాగుతుంటాయి. అందువలన ప్రతిక్షణమూ నూతనమైన దయినా నూతనంగా దర్శింపలేక పోతున్నాడు. పిల్లల్లోనున్న మానసిక నిబద్ధత వారి సహజ ప్రవృత్తిని ఏవిధంగా నాశనం జేస్తున్నదో, వారి సంబంధాల నెలా యాంత్రికం జేస్తున్నదో తల్లిదండ్రులూ, ఉపాధ్యాయులూ చూడా లంటారు కృష్ణమూర్తి. గతాన్నుండి వారు స్వేచ్ఛనొందాలనీ వారి పిలల్లను గూడా స్వేచ్ఛతో, వర్తమానంలో పెంచమనీ, స్వేచ్ఛగా జీవించేట్లు బోధించమనీ చెప్తారు.

పోల్చి చూడటం పోటీ స్వభావాన్ని పెంచుతుందంటారు. పోటీ ఆందోళననూ, సంఘర్షణనూ, అసూయనూ, కోపాన్నీ క్రూరతనూ పెంచి పిల్లలను నిబద్ధులను జేస్తుంది. ఆ విధంగా సాంఘిక సాంస్కృతిక నిబద్ధత పోషించబడుతుంది. అందుకే 'పోల్చవద్దు పోల్చటం మంచిది కాదు. యదార్థాన్ని పూర్తి యదార్థతగానే చూడు యదార్థాన్ని చూచినపుడు అదే నిబద్ధతను అంతం జేస్తుంది.' అంటారు వీరు. తెలిసో తెలియకో అలాపోల్చి చూసుకోవడం వలన ఆ భావాల ముసురులో తనకున్న శక్తియుక్తులను సంపూర్ణంగా వినియోగించుకోలేరు.

ప్రతి విద్యార్థికి సృజించే శక్తి ఉందన్న నమ్మకంతో ఉపాధ్యాయుడు సృజించటంలో విద్యార్థికి సహాయపడాలను కుంటాడు. కాని కేవలం జ్ఞాన సంపాదనకే ప్రాముఖ్యత నిచ్చేటప్పుడు సహాయమనే పేరుతో యదార్థదర్శనాన్ని ఆటంకపరచినప్పుడు విద్యార్థి

నిబద్ధుడవుతాడు. ఉపాధ్యాయుని దృష్టితోనే తాను విషయాన్ని చూడ ప్రయత్నిస్తాడు గాని స్వేచ్ఛగా పరికించడు. సున్నితత్వాన్ని కోల్పోతాడు. ఉపాధ్యాయుడు చెప్పిన దాన్నే ఆచరిస్తూ దేన్నీ ప్రశ్నించక పోవడం వల్ల విద్యార్థులకు సహజంగా ఉండే కుతూహలము వాస్తవ విషయాల పట్ల జిజ్ఞాస నాశనమౌతుంది.

తాను చేయాలనుకున్న దానికి, వాస్తవంలో చేస్తున్నదానికీ ఎంతో అంతరం కన్పిస్తుంది. వీటిలో ఏది కొనసాగించాలో నన్న ప్రశ్న సంఘర్షణకు దారితీస్తుంది. ఇలా సంఘర్షణను పెంచే బదులు నిబద్ధత పాత్రను గ్రహించి పిల్లలు స్వేచ్ఛగా పెరగటానికి వీలుగల్పిస్తే వారిశక్తి సామర్థ్యాలను వ్యక్తంచేసేందుకు తగిన భూమిక నేర్పరచవచ్చు.

ఎన్నో శతాబ్దాల భయం, ఆందోళన, సంఘర్షణల నడుమ భౌతిక మానసిక భద్రత కోసం చేసే ప్రయత్న ఫలితమే మానవుని నడవడియని గుర్తించారు కృష్ణమూర్తి. యాంత్రికమైన పనులను నిర్వహించటంలో నిబద్ధత తప్పదు. కాని ఆ నిబద్ధతనే మాత్రమూ ప్రశ్నించనపుడు మనిషి యాంత్రిక స్థాయికి దిగజారుతాడు. మనిషి ఏదోఒక దానిని నమ్ముతాడు. ఒక దేవుడినో, పలువురు దేవతలనో, దేవుడులేకపోవడాన్నో నమ్ముతాడు. పదార్థాన్నుండి మనసొచ్చిందనో, మనసే పదార్థానికి మూలమనో నమ్ముతాడు. ఒకరి నీతి మరొకరికి అవినీతి, సౌఖ్యమనే సిద్ధాంతంమీద జీవితమాధార పడిందని ఒకరంటే మరొకరు కాదంటారు. ఆలోచించే మనిషి ఏదో ఒకదాన్ని నమ్ముతాడు. తాను 'దేన్ని నమ్మడు' అనుకోవడం గూడా ఒక నమ్మకమే! తెలిసో తెలియకో ప్రతి మనిషీ ఏదో ఒక ప్రశ్నకు సమాధానం కోసం కొట్టుకుంటుంటాడు. ఎవరో ఒకరిచ్చిన సమాధానాలను నమ్మడంలో సౌకర్యాన్ని పొందుతాడు. కాని స్వంత అవగాహనకు కృషిచేయడు. భౌతికంగా ఇతరుల పైన వారి భావాలపైన ఆధారపడటం జీవితధర్మమే ! కాని మానసిక నియంత్రణతో చేసే ఆలోచనలు మనసును నిస్సత్తువగా మెదడును సోమరిగా జేసి భావాలను ప్రభావితం చేస్తాయిగనుక చేసే పనులు కూడా పాక్షికమౌతాయి. మెదడుకున్న సామర్థ్యాలు బయటపడవు. వికసింపవు పైగా అలవాటైన వరవడిలో ప్రతిస్పందించటం జరుగుతుంది గాని స్పందించటం జరుగదు. అలాంటి ప్రతిస్పందన అర్థరహితమవుతుంది. కనుక ఇట్టి నానారకాలైన నిబద్ధతకు లోనయ్యే విద్యార్థికి కేవలం విద్యావిషయక శిక్షణే గాక స్వేచ్ఛంటే ఏమిటో ఉపాధ్యాయుడు తెలియజేసి, విద్యార్థులలో స్పందన గలిగేందుకు సహాయపడే విధంగా బోధించాలి.

## ప్రేరణ (Motivation)

సహజంగా మనిషికి మానసిక ప్రేరణ ఉంటుంది. మానవ మనుగడకు యీ ప్రేరణెంతో అవసరమంటారు కృష్ణమూర్తి. 'నేను' అనే కేంద్రాన్నుండి వెలువడిన ప్రవర్తన, సమాజ మంగీకరించిన విలువల చేత, వాటి ఆధిక్యతచేత ప్రేరేపింపబడిన ప్రవర్తన మనిషిని నిబద్ధునిగ జేస్తుంది. ప్రజ్ఞ నుండి సహజంగా సూటిగా అప్రయత్నంగా ఉద్భవించిన అవగాహనను ఏ ఆలోచనా నిరోధించనప్పుడు నిబద్ధితమైన, సంకుచితమైన నడవడి తొలగి పోతుందంటారు. ప్రయత్న పూర్వకమైన ప్రేరణతో గానీ తనపై రుద్దబడిన ప్రేరణతో గానీ మనిషి మంచివాడుగాలేడు. పిల్లలను ప్రేమించుతూ వారికి కావలసిన వీయగల్గినప్పుడు వారిలో కల్గిన భద్రతలో సహజ ప్రేరణ ఉంటుందంటారు.

## వైఖరులు (Attitudes)

ఒక మనిషి గురించిగాని విషయాన్ని గురించిగాని ఒకవిధంగా భావించటానికి ఒక పద్ధతిలో పనిజేయటానికీ సిద్ధంజేసేవి వైఖరులు. ఈ వైఖరులు కొందరిని అవమానించటానికీ, మరికొందరిపై అపనమ్మకానికీ ప్రోత్సహిస్తాయి. అందువలన వాస్తవమైన విలువలేమిటో తెలుసుకోకుండానే కొన్నిటిని తక్కువగా మరికొన్నింటిని ఉన్నతంగా చూస్తాము. మనిషి తానార్జించిన జ్ఞానంతో అహాన్ని తృప్తిపరచే అభిప్రాయాల నేర్పరచుకుని వాటిని వ్యక్తం జేయటంలో ఆనందాన్ని పొందుతాడు. సాధారణంగా తానేర్పరచుకున్న అభిప్రాయాలపట్ల నియమాల పట్ల మాత్రమే నిజాయితీగా ఉండటానికి తాపత్రయపడుతూ తాను నిజాయితీ పరుడననుకుంటాడు. హేతువాదాలు జేస్తాడు. కాని అన్ని అభిప్రాయాలు, సిద్ధాంతాలు, నియమాలు కృష్ణమూర్తి దృష్టిలో కేవలం నిజాయితీ లోపించిన కల్పనలే. కాల్పనికుడెప్పుడూ భవిష్యద్మానవుని కోసం నేటి మానవుని త్యాగం జేస్తుంటాడు. కాల్పనికుని జీవితమెప్పుడూ భూతకాలంలో గానీ భవిష్యత్తులో గానీ ఉంటుంది. వర్తమానంలో ఉండదు. మనిషెప్పుడైతే భావనా జగత్తులో చిక్కుకు పోతాడో అప్పుడు వాస్తవాన్నెదుర్కోలేడు. పదార్థ వాదయినా కాల్పనిక వాదయినా తన భావాలకే ప్రాధాన్యత నిస్తాడు. మనస్తత్వవేత్తలు సుముఖమైన వైఖరులను పెంపొందింప మంటారు. మానవ సంబంధాలు ఉండాలంటే ఎట్టి వైఖరీ లేక స్వేచ్ఛగా ఉన్నప్పుడే మానసిక రంగంలో నిష్పాక్షికంగా ఉండటం సాధ్యమవు తుందంటారు. ఉపాధ్యాయులు ఎట్టి వైఖరినీ ప్రవేశ పెట్టనప్పుడు విద్యార్థులు యదార్థాన్ని గ్రహిస్తారు.

## పోలిక (Comparison)

పోల్చడం గూడా నిబద్ధతే నంటారు కృష్ణమూర్తి. జ్ఞాపకాలు పోల్చి చూస్తాయి, దూషిస్తాయి, మార్చుతాయి. కాని క్రొత్త అర్థాన్ని తెచ్చిపెట్టలేవంటారు. తాను ఆలోచిస్తున్నది ఉన్నతమైందో కాదోనని, తానున్న స్థితిని తాను కావాలనుకున్న స్థితితో పోల్చుతాయి గతానుభవాలు. ఈ పోలిక ఫలితంగా తాను మరొకరిలాగా ఉండే ప్రయత్నం జరుగుతుంది. ఇది ఆందోళనకు, అసూయకు, వైరానికి, సంఘర్షణకు దారి తీస్తుంది. గందరగోళపడిన మనసు తాను ఏంచేసినా, ఏ స్థాయిలో చేసినా ఆ గందర గోళంలోనే ఉంటుంది. తన్మూలమైన పనేదైనా మరికొంత గొడవల వలయాన్ని సృష్టిస్తుంది.

పోల్చే మనసు నిశ్చింతగా ఉండదు. ఒకరకంగా ఉండటానికి వేరొక రకంగా ఉండాలను కోవటానికీ మధ్య ఘర్షణతోనే ఉంటుంది. ఇదొక రకమైన చికాకు. అనిశ్చితమై పోల్చేమనసు అవగాహన చేసుకోలేకపోగా ఆందోళననో, ఈర్ష్యనో, తక్కువన్న భావనో లేక దానిని కప్పిపుచ్చు కునేందుకు ఎక్కువన్న భావననో, తనపై తనకు జాలినో కల్పి స్తుంది. భద్రతకోసం నేటి ప్రమాణాలకో, నాటి ప్రమాణాలకో కట్టుబడి ఉండేట్లు జేస్తుంది.

మానవ ప్రయత్నాల్లో ఎంపిక చేయటం ఎంపికలో పోల్చటం, బేరీజు వేయటం, త్రోసివేయటం జరుగుతాయి. ఆలోచనల్లో పోరాటం, భిన్నత్వం చోటు చేసుకుంటాయి. ఇష్టంతో, కోరికతో, వత్తిడితో, వాంఛతో చేసే పనులన్నీ యీరకమైన మనసు నుండి ఉద్భవించినవే నంటారు కృష్ణమూర్తి. నిజానికి యీ గందరగోళంలో స్పష్టమైన సులభ మైన దృష్టి లోపించి మనిషి సరిగా బేరీజు వేయలేడు. తననుతాను అందుకు నిందించు కుంటాడు. స్వార్థంతో సహింపలేక పోవడం వలన సమస్య చిన్నదవకపోగా పెరుగుతుంది. పోల్చటమన్నది జీవితంలో వాస్తవాన్ని ఎదుర్కొనీయక కలవర పరుస్తుంది.

## పోటీ (Competiton)

పోలిక ఉన్నపుడు పోటీ తప్పదంటారు. కృష్ణమూర్తి ఆర్థిక రంగంలో సాంఘిక విద్యారంగాల్లో యీ పోటీ ఒక ప్రేరణగా వ్యక్తి అభివృద్ధికెంతో దోహదం జేస్తున్నట్లు కన్పిస్తుంది. కానీ పోటీవలన మనిషిలో సమగ్రత లోపిస్తుంది. సాంఘిక సంబంధాలు సక్రమంగా ఉండవు. ప్రారంభంలో ఉత్సాహం గల్గించినా కాలం గడిచేకొద్దీ ఎవరిలోనూ ఎలాంటి ఉన్నతినీ తీసుకురాలేదు.

పక్షపాత ధోరణికి, మనిషి మనుగడకీ ముప్పువాటిల్లే విధంగా పన్నాగాలు చేయటానికి, వ్యతిరేక ధోరణికి పోటీ పురికొల్పుతుంది. తానింకా బాగుండాలీ, లాభం పొందాలి అని మనిషి అనుకున్నప్పుడు అతనిలో భద్రతాభావం, సున్నితత్వం, ఇతరులంటే అభిమానం, సామాజిక స్పృహ, సహకారం క్షీణిస్తాయి. అభద్రత తనను తాను అనుమానించేట్లు చేస్తుంది. సంతోషాన్ని దూరంజేస్తుంది. 'పుస్తక జ్ఞానమే అన్నింటికన్న మిన్న' అనుకునే విద్యావంతులకు పోటీ ఒక పరికరం. పిల్లలను సంపూర్ణంగా తీర్చిదిద్దాలనుకునేవారికి మాత్రం యీపోటీ పోలికలు పెద్ద అవరోధాలు.

## అధికారం (Authority)

సమాజంలో ఉద్యోగమిచ్చేవారూ, చేసేవారూ, తల్లిదండ్రులు పిల్లలు, ఉపాధ్యాయులు విద్యార్థులు కలసిమెలసి జీవించవలసిన సంస్థలెన్నో! పెద్దలైనా అధికారులైనా తమ పిల్లలు, తమ క్రింద పనిచేసే వారూ నిజాయితీగా ఉండాలని, సృజనాత్మకంగా పనిచేయాలనీ మంచి పనిచేయాలని, ఎక్కువ పని చేయాలని ఆశిస్తారు. కట్టడి చేస్తారు. చిన్నబుచ్చుతారు. బాధిస్తుంటారు. అందువలన ఉద్యోగుల్లో పోట్లాడే స్వభావం, నిస్పృహ, పిరికితనం, వెనుకకు మరలిపోవటం చోటు చేసుకుంటాయి. ఈ పరిణామాలకు కారణమైన అధికారాన్ని త్రోసి వేయాలా? త్రోసిపుచ్చకుండా పరిశీలించమంటారు కృష్ణమూర్తి.

కొందరు గుర్తింపు నాశించి, భద్రతనాశించి తమస్థానాన్ని పటిష్టం జేసుకుంటారు. చేతగాని వారూ, భద్రత లేనివారూ భయపడుతుంటారు. తాము చేసేది సబబో కాదోనని అనుమానించేవారు వారికంటే అధికుల మనుకునే వారినుండి సహాయం కోరతారు. ప్రతిగా వినయాన్ని చూపుతారు. వినయ భావం భయాన్ని పెంపొందిస్తుంది. ఆ భయమే తమలోనున్న స్వాభావికమైన ప్రజ్ఞను గుర్తింపనీయదు. పరుల దృష్టి నాకర్షించటం కోసం వారికున్న కొద్దిపాటి విశేషతనూ ప్రదర్శించుకునేందుకు ప్రయత్నిస్తారు. క్లిష్టమైన జటిలమైన సమస్యల్ని వెంటనే పట్టించుకోరు. వాయిదావేస్తూ పోతుంటారు.

మనిషి జ్ఞానాన్ని, గెలుపును, దైహిక శక్తి వంటి అధికారాలను ఎన్నింటినో గౌరవిస్తాడు. సవ్యమైన సాంఘిక పాలనకు పోలీసు న్యాయస్థానం యిత్యాది బాహ్యాధికారాలు అవసరమే. అనుభవజ్ఞానమనే అంతర్గతాధికారం జీవితం పట్ల కొన్ని వైఖరులను ఏర్పరుస్తుంది. పరిణతినొందని విద్యార్థులను విషయోన్ముఖులుగా జేయటానికి సాంకేతిక రంగంలో నిపుణులైన వారి ఆధిపత్యం అవసరమే. వారినుండి సాంకేతిక

జ్ఞానాన్ని కౌశల్యాలనూ నేర్చుకోవాలి కాని మానసిక రంగంలో యీ ఆధిపత్యం, ఆధార పడటం సంపూర్ణ దృష్టికి ఆటంకాలవుతాయి. మెదడుకున్న శక్తి నంతటినీ వినియోగించు కోనీయవు. అధికారం, వినయం, ఆధారపడటం, చేరువవటం సున్నితత్వాన్ని హరిస్తాయి. ప్రత్యక్ష దృష్టికి సృజనతకు అడ్డుగోడలవుతాయి. అంత ర్దృష్టికి అవకాశముండదు.

అధికార వైఖరి ప్రజ్ఞనంతటినీ నాశనం జేస్తుంది. అధికారాన్ని గుడ్డిగా అంగీక రించటం, అనుసరించటం అపసవ్యతను తెచ్చి పెడుతుంది.

## భద్రత (Security)

సాంప్రదాయాన్నంగీకరించటం, అనుసరించటం చూస్తే అది జీవితానికి బాహ్యా అంతరంగ భద్రతనిస్తున్నట్లు కన్పిస్తుంది. కాని, నిత్యమూ భద్రతను కోరుకోవటమే విభజనకు దారితీస్తుంది, అంటారు కృష్ణమూర్తి.

మనిషెప్పుడైతే నాకుటుంబం, నాభార్యా పిల్లలు, నావారి శ్రేయస్సు అని కోరుకుంటాడో అప్పుడు ప్రపంచానికి వ్యతిరేకమవుతాడు. అలా వేరయిపోయిన 'నేను' కు కుటుంబంలో, స్నేహితుల్లో, సంపాదనలో, ఆస్తిలో, ఉద్యోగంలో ప్రతిచోటా భద్రత గావాలి. 'నా కుటుంబం' అన్న ఆలోచనలో మనిషి ఆధిక్యతను, గౌరవాన్ని అనందాన్ని పొందుతాడు. తన పిల్లల గురించి ఎంతెంతో ఆశించి ఆందోళనపొంది మానసిక భద్రతను కోల్పోతాడు. కుటుంబ సంక్షేమాన్ని కోరుతూ స్థాయీపరమైన మానసిక భద్రతను కాంక్షిస్తూ చేసే పనులతో భౌతిక భద్రతకు దూరమవుతాడు. పిల్లలపట్ల, దైనిక జీవితంలో తగినంత శ్రద్ధ తీసుకోనప్పుడు, వారిని ప్రేమించనప్పుడు భద్రత లేకపోయి నందువలన పిల్లల నాడీమండలం మనసూ బాధింప బడతాయి.

మనిషి మానసిక భద్రత కోసం సాంప్రదాయానికి కట్టుబడి ఉంటాడు. ఏదో కావాలని పరిపూర్ణత పొందుదామని తపనపడే మనసు ధార్మికమైన, రాజకీయ పరమైన, సాంఘిక పరమైన ఆచారాలను హక్కులను నమ్మకాలను ఒక తరాన్నుండి మరొక తరానికి సంక్రమింప జేస్తుంటుంది. భద్రత కొరకు ఏర్పరచుకున్న ఒక నమ్మకం మరొక నమ్మకాన్ని ఒక ధర్మం మరొక ధర్మాన్ని వ్యతిరేకిస్తుంది. భద్రత కావాలను కోవడమే భద్రతను నాశనం జేస్తుంది. మెదడును సంకుచితం జేసి సదా ఆలోచనలను రేకెత్తిస్తుంది. అసాధారణ సామర్థ్యమున్న మెదడు తరతరాలుగా నిబద్ధమై మోసపూరితమైన భద్రతనాశించి ఇప్పుడొక వేళ్ళూనుకొన్న అలవాటుగా మారింది.

## తాదాత్మ్యీకరణ (Identification)

తన భద్రతకోసం మనిషి ఒక సంస్థతోనో, మతంతోనో, సంఘంతోనో తాదాత్మ్య మొందుతాడు. తాదాత్మ్యమొక సంపదలాగా ఆధిక్యంతో ఉంటుంది. ఉదాహరణకు మనిషికి ఆస్థి ఉన్నప్పుడు భద్రతా భావంతో ఉంటాడు. ఆ భావం ప్రశ్నింపలేనంత అభేద్యమై ఉంటుంది. కాని తాదాత్మ్యతలో ఎంతోకొంత విరోధముంటుందంటారు కృష్ణమూర్తి.

బాధలకు తాళలేని మనిషి తననుతాను మరచిపోదలచి తనకంటే అధికునితో తాదాత్మ్య మొందుతాడు. వ్యక్తిగత ఉద్రేకంతోగానీ, సామాజిక ఉద్రేకంలో గానీ, విశిష్టమైన ఆలోచనల్లోగానీ ఎన్నింటినో స్మరించుతూ తననుతాను మరుస్తాడు. మనిషికేదో ఒక స్థాయిలో తన సంకుచితత్వాన్నుండి బయట పడాలన్న సహజ వాంఛ ఉంటుంది. సంకుచిత భావంతోనూ విశాల భావంతోనూ తనను తానుమరచి పోవాలనుకుంటాడు.

ఒక కుటుంబంతోనో, ఉద్యోగంతోనో, సమాజంతోనో, దేశంతోనో తాదాత్మ్య మొందిన మనిషికి భద్రత ఉన్నట్లుగా తోచినా తననుతాను తెలుసుకుంటూ ఆవిష్కరించు కోవటానికి తాదాత్మ్య భావం అవరోధమవుతుంది. వివేక హీనుని జేస్తుంది.

## విలువలు (Values)

సమాజపరమైన అభిప్రాయాలు, అనుభవాల ఫలితంగా ఏర్పరచుకున్న జాతి కులమత పరమైన అభిప్రాయాలు, స్వంత అభిప్రాయాలు - ఇవన్నీ విలువలే నంటారు కృష్ణమూర్తి. దీర్ఘకాలికాలయినా కాకున్నా ప్రతిమనిషికీ కొన్ని ఉద్దేశాలు విలువలు వుంటాయి. అవి ఇతరుల విలువలకు భిన్నంగా ఉండొచ్చు. కానీ అవి వారి కోరికలతో తెలివితో పండించుకున్నవి. యదార్థాలైనా, అపోహలైనా, వారికి అవే సౌకర్యంగా ఉండొచ్చు. ఓదార్పు గావచ్చు. చిన్ననాటి నుండీ మనిషి కొన్ని విలువలను పటిష్టం జేస్తూ ప్రోత్సహిస్తుండవచ్చు. విలువలనబడే యీ భావనల ఫలితాలను గ్రహించమంటారు. మానవులను విభజిస్తూ ఒకరినొకరు వ్యతిరేకించుకునేట్లు ఉసిగొల్పుతూ మానవు డేర్పరచుకున్న యీ విలువలు సంఘర్షణను, హింసను, వైరాలను ఎలా ప్రోత్సహిస్తున్నదీ చూడమంటారు.

## నమ్మకం (Belief)

'విషయంపట్ల ఉండవలసిన ప్రత్యక్ష దృష్టిని నమ్మకం పాడుజేస్తుంది' అంటారు కృష్ణమూర్తి. నమ్మకం అనుభవాన్ని నిబద్ధితం జేస్తుంది. అనుభవం నమ్మకాన్ని పటిష్టం జేస్తుంది. మనిషి తాను నమ్ముతున్నదాన్ని అనుభవిస్తాడు. అనుభవాలను నిబద్ధంజేసి అర్థాన్ని లాగి కావాలనిగానీ, వద్దనీగానీ అంటుంది మెదడు, మెదడే అనుభవాల ఫలితం. ఏదో ఒక విధంగా తనకు తెలిసినదాన్నే గుర్తించి దాన్నే అనుభవించేట్లు జేస్తుంది.

మనిషి చరిత్రను, సాంప్రదాయాన్ని, పెద్దలు చెప్పిన వాటిని, పుస్తకాలలో వ్రాసిన దానిని నమ్ముతాడు. వీటన్నింటిలో నమ్మకం గల్గించే బాధ్యతను ఆలోచన తీసు కుంటుంది. ఆ నమ్మకాలు అనుభవాలను నిర్దేశి ంచటం వలన అతనికి యదార్థాన్ని చూడగల సూటియైన దృష్టి, నూతన దృష్టి ఉండదు. ఒక నమ్మకం మరొక నమ్మకానికి వ్యతిరేకమయినప్పుడు సంఘర్షణ బయలు దేరుతుంది. మనుష్యులను విడగొట్టి జీవితాలను నిర్దేశించి మనసును నిరుత్సాహపరచి చురుకు దనాన్ని పోగొడుతుందీ నమ్మకం.

## ఊహారూపాలు (Images)

మనిషి తనగురించి చుట్టూఉన్న వారిని గురించి ఊహా రూపాలేర్పరచు కుంటాడు. అతనికి తెలిసిగానీ తెలియక గానీ ఎన్నో అనుభవాలుంటాయి. ప్రతి అనుభవమూ అతనిపై ఒక ముద్రవేస్తుంది. నిత్యమూపడే యీ ముద్రలు ఊహారూపాల నేర్పరుస్తాయి. మనిషి తన జ్ఞానం, ఆలోచన, జీవిత పోరాటపు అనుభవాలు, సంఘర్షణలు, దురవస్థలను కలిపి ఊహారూపాల నేర్పరచుకుంటాడు. తన అభిప్రాయాలతో ఊహల్లో, ఊహాప్రతి రూపాలలో బ్రతుకుతుంటాడు. అంటే 'నా గురించి నేనేమనుకుంటున్నాను?' 'నా గురించి ఇతరులేమను కుంటున్నారు' వంటివి యోచిస్తుంటాడు. పరులపట్ల తనకుండే ఇష్టాయిష్టాలు కావాలను కోవటం, వద్దనుకోవటం - అన్నీ యీ ఊహారూపాల ఫలితమే.

సాంప్రదాయంలో పెరుగుతూ ఎన్నో వత్తిడులకు లోనయే మనిషికి క్రమంగా తన ఊహారూపాలు గూడా గాఢమయి హితం జేస్తుంటాయి. తానేర్పరచుకున్న ప్రతి రూపమే తనను నిబద్ధం జేస్తుంది. ప్రతిరూపాలు ఆధిక్యత వహించినంత వరకూ అభిప్రాయాల మధ్య తప్ప మనుష్యుల మధ్య ఏ సంబంధమూ ఉండదు.

మనిషి ఆలోచనలు వాటి ప్రతిబింబాలు పరస్పర సంబంధాలను నిబద్ధం జేయటమే గాక వాటిని దృఢతరం జేసుకునేందుకు ఒక సిద్ధాంతాన్ని గూడా రూపొందిస్తాయి. ఇదెంతటి కల్పనకైనా, ఆస్తికత్వ నాస్తికత్వాలకైనా దారి దీస్తుంది. ఆ దేవతనీ, యీ దేవతనీ పలురకాల దృష్టి భేదాలను గూడా కల్గిస్తుంది. ఈ ఊహారూపాలపై ఆధారపడిన మనిషి తనచుట్టూ తానొక గిరిగీసుకుంటాడు. వాటిని దృఢతరం జేసుకుంటాడు గాని ఊహారూపాలను వదలి యదార్థాలను చూడలేడు.

## సుముఖత - విముఖత (Acceptance - Rejection)

(అంగీకరించటం - అంగీకరించక పోవడం)

'పోల్చటానికీ తాదాత్మ్యత నొందటానికీ మరో రూపమే సుముఖతనో లేక విముఖతనో చూపటం' అంటారు కృష్ణమూర్తి. తనకొక మంచి సాంఘిక స్థానమీయ గల్గిన దానిని మనిషి గౌరవిస్తుంటాడు. జీవితాన్ని అసహ్యించుకునే మనిషి దాన్నుండి తప్పించుకునే ప్రయత్నంలో దేవుడిని ప్రేమిస్తాడు అంటారు. ఇష్టం లేనిదాన్ని విముఖతతో త్రోసివేస్తాడు. దానిపట్ల ఈర్ష్య పెంచుకుంటాడు. ఇష్టమైన దానితో ఐక్యభావాన్ని చూపి అంగీకరించి దానిపైన ఆధారపడతాడు. అయిష్టమైన వాటి నుండి తప్పించుకోవటానికి గూడా కొన్నింటి నిష్టపడి ప్రేమిస్తాడు. అలాంటి మనిషి నిష్కల్మషంగా తననుతాను తెలుసుకోలేడు.

సాంకేతిక విషయాలను పరిగణించి వాటికున్న నాణ్యతను విలువలను బేరీజువేసి కొన్నింటిని వద్దని, మరి కొన్నింటిని కావాలని ఉపయోగించుకోక తప్పదు. ఎంపికచేయటం సాంకేతిక రంగంలో సాంకేతిక పటిష్టతకు దోహదం జేస్తుంది. కాని తన గురించిన జ్ఞాన సముపార్జనలో యీ లాభనష్టాల దృష్టి 'నేను' అన్న అహానికి కేంద్రమై తనను తన సంబంధాలను నిష్పక్షపాతంగా ఉండనీయదు.

## పద్ధతి (Method)

'ఆలోచన మనసును ఊహాప్రతిమతో గానీ, ఆశయంతోగానీ నమ్మకంతో గానీ, తాదాత్మ్యతతో గానీ నిబద్ధిస్తుంది. సమస్యను సృష్టిస్తుంది. తిరిగి పరిష్కారాన్ని కనుగొనాలన్న ప్రయత్నంలో ఏదో ఒక పద్ధతి ననుసరిస్తుంది' అంటారు కృష్ణమూర్తి.

ఏపద్ధతైనా కోరికను నియంత్రిస్తుంది. లేకుంటే అణగద్రొక్కుతుంది. దారి మళ్ళిస్తుంది. ఎన్నెన్నో సూక్ష్మమైన, మూర్ఖమైన ఆటంకాల నేర్పరుస్తుంది. ఏ పద్ధతైనా సాంకేతిక రంగంలో సక్రమంగా నిర్వహించటానికి, సౌభాగ్యవంతమైన జీవితానికీ దోహదం జేయవచ్చుగానీ మనిషి తననుతాను తెలుసు కోవటానికి మాత్రం ఏపద్ధతీ సహాయ పడలేదు.

## విశ్లేషణ (Analysis)

ఒక సమస్య వచ్చినపుడు విశ్లేషించటానికి తరతరాలుగా మనసు నిబద్ధమయింది. విశ్లేషణ కూడా నిబద్ధతతోనే జేస్తుంది. విశ్లేషకుడు ప్రతిపొరనూ తొలగిస్తూ విషయాన్ని పరికిస్తాడు. అందుకు కొంత సహాయమూ అంతర్దృష్టి అవసరం. విశ్లేషణ అసంబద్ధమూ అసంపూర్ణమూ అయినప్పుడు, ఆదిలోనే తప్పయినప్పుడు తర్వాతచేసే విశ్లేషణంతా తప్పవుతుంది. యదార్థం గోచరింపదు. 'విశ్లేషణలో విశ్లేషింప బడేదీ, విశ్లేషించేవాడూ అన్న ద్వంద్వ సమస్య ఉన్నది. విశ్లేషించేవాని పక్షపాత వైఖరి పెద్ద అవరోధం. విశ్లేషించేవాడు తనతోటి వాడయితే అతని ప్రవర్తన నటనలు మరొక సమస్య. ఇవన్నీ విశ్లేషణను తప్పుద్రోవ పట్టిస్తాయిగాని తేటతెల్లం జేయవు. ఏవిధంగానూ ముందుకు నడపవు. విశ్లేషించి చేసిన పనేదీ సత్ఫలితాల నీయదు. విశ్లేషించటానికి కొంత సమయం పడుతుంది గనుక వర్తమానంలో ఏపనీ జరుగదు' అంటారు కృష్ణమూర్తి.

విశ్లేషణా విధానంలో బుద్ధి ఎంతో పదునెక్కుతుందనీ శ్రద్ధతోజేసే విశ్లేషణ వలన ఎంతో అవగాహన ఏర్పడినా విషయాన్ని ఆసాంతమూ పరికించి దానినుండి బయట పడినప్పుడే పూర్తి అవగాహన సాధ్యపడుతుందనీ అంటారు. విజ్ఞాన శాస్త్రంలోగానీ, సాంకేతిక రంగంలో గానీ క్రొత్త క్రొత్త వాటితో తలపడేటప్పుడు విశ్లేషణ అవసరమే, కాని తననుతాను తెలుసుకున్నప్పుడు నిబద్ధతకు లోనైన విశ్లేషణలో తగిన సూటి దనముండదు. పైగా నిబద్ధితమైన విశ్లేషణ విషయావగాహనకు ఒక ఆటంకం గూడా. కనుక విషయాన్ని

సులభతరం జేసుకోవటానికి కొంతవరకూ దానికున్న పరిమితుల దృష్ట్యా విశ్లేషణ నుండి గూడా స్వేచ్ఛ నొందినప్పుడే సమస్య యొక్క సమగ్ర రూపం గోచరమవుతుంది.

★ ★ ★

ఇంద్రియాల ప్రేరణకు మెదడు తనపాత అనుభవాల నుండి స్పందిస్తుందని దానిని జ్ఞాపకముంచుకుని ఆలోచనగా వ్యక్తపరుస్తుందని ఆపై ఈ చర్యనంతటినీ మెదడులో పదిలపరచు కుంటుందనీ స్పష్టమైంది. ఈ ప్రక్రియ అనంతంగా సాగుతూనే ఉంటుంది. అమాయకుడైన సామాన్య మానవుని నుండి గొప్ప నోబెల్ బహుమతి గ్రహీత వరకూ ఆలోచన సర్వసామాన్యం. ఆలోచన మనిషి ప్రవృత్తి.

ఆలోచన ఎంత తెలివైందో, కపటియో, తన సౌలభ్యంకోసం ఎన్ని రకాలుగా ఎంతగా మారుతుందో, తన ఉనికి కోసం ఎన్ని సంకెళ్ళను తయారు జేస్తుందో, మానవులను ఏవిధంగా విడగొడ్తుందో గూడా తెలిసింది.

'మనిషి తనకున్న ఆలోచనా ప్రవృత్తిని ప్రశ్నించలేడు. కళ్ళు, కాళ్ళు ఎంత అవసరమో ఆలోచన కూడా నిత్యమూ తప్పదనుకున్నాడు. ఆలోచన యొక్క లోతులను పరికింపడు. దానినెవరూ ప్రశ్నింపకపోవటం వలన దాని ప్రాముఖ్యత పెరిగింది. నియంత అయింది. నియంత లెప్పుడూ సామాన్యులకు ఒక సవాలు అంటారు' కృష్ణమూర్తి. ఈ ఆలోచన మానసిక కాల సృష్టికి మూలం. మనసును భూత భవిష్య త్కాలాలకు నిబద్ధం జేసి ఊహా ప్రతిమల నేర్పరుస్తుంది. ఈ ఊహా ప్రతిమలు భద్రత నాశించి ఒకరికి దగ్గరవటం గానీ, అధికారానికి తలవొగ్గటం గానీ, తాదాత్మ్య మందటం గానీ, ఆశయాలేర్పరచు కోవటం గానీ, భద్రతా లేమితో వెనక్కు పారిపోవటం గానీ జేస్తాయి. ఆలోచన తిరుగుబోతు దనానికి, మత్తు మందులకు, సుఖాన్వేషణకూ మూలమై ఆశలకు, ఆశయాలకు, భావాలకు, సూత్రాలకు, సిద్ధాంతాలకు ప్రేరణై భవిష్యత్తులోనికెలా ఎదిగిపోతున్నదో గూడా తెలిసింది.

తాను సృష్టించిన సమస్యల నెదుర్కొనవలసి వచ్చినప్పుడు అన్నింటినీ కాదని, వద్దనీ, అవునని, లేకుంటే అణగద్రొక్కి, దారిమళ్ళించి, పోటీపెట్టి, పోల్చి, తిట్టి, తాదాత్మ్యమంది పలాయన మార్గాల్లో రక్షణ పొందాలంటుందీ ఆలోచన.

శక్తి ఒక పద్ధతిలో పనిచేయటం వలన ఆలోచనవుతుంది. పదార్థానికి శక్తికి

పరస్పర సంబంధమున్నది. ఒకటి లేక మరొకటి లేదు. ఈ రెండింటి సమన్వయంలో మెదడు యొక్క కణాలు చురుగ్గా ఉంటాయి. ఆలోచన శక్తికి ఒక వ్యక్తీకరణ కనుక ఆలోచన గూడా పదార్థమే నంటారు కృష్ణమూర్తి. ఆలోచన అనే యీ పదార్థాన్ని స్వార్థ పూరితంగా, నిబద్ధితంగా, ఆశయపూరితంగా పలురకాలుగా వినియోగిస్తూ మనిషి వర్తమానాన్ని క్షణక్షణమూ ఆటంక పరుస్తాడు. మెదడు కణాలను యీ ఆలోచనలతో నాశనంజేసి సహజ శక్తిని కోల్పోతున్నాడు.

మనుషులను విభజించి మానవ సంబంధాలను కలుషితం జేయటమేగాక జీవిత చిత్రాన్నే హస్తగతం జేసుకుని సామాన్యుని నుండి శాస్త్రవేత్త వరకూ ఆలోచన ఎంతో ప్రాముఖ్యత వహించింది. ఒక నమ్మకంగా, ఆశగా, ఆశయంగా మనిషి ఆలోచనలు రూపొంది ఊహా ప్రతిరూపాల నేర్పరచుకుని, పోల్చుకుని, తాదాత్మ్యమొంది భద్రతకోసం ఎలా ప్రయత్నిస్తున్నదీ చూశాం. పర్యవసానంగా మనిషిలో హింసా ప్రవృత్తి గలిగి భయం, ఈర్ష్య, క్రూరత, కోపం ఇత్యాదులుగా వ్యాపిస్తున్నది. సంఘర్షణకు దారితీస్తున్నది. దుఃఖాన్ని మిగుల్చుతున్నది.

## హింస (Violence)

భౌతికంగానేగాక మానసికంగానూ ఎన్నోరకాలుగా మనిషి తోటివారిని హింసిస్తాడు. భౌతిక గాయాలను మాన్పవచ్చుగానీ మాటల తూటాలుచేసిన గాయాలను మాన్పటం కష్టం. తనను ఇతరులెక్కడ అణగత్రొక్కుతారోనన్న భయం తోనూ, ఇతరులతో పోల్చుకోవటం వలన గల్గిన అసూయతోనూ ఇతరులను బాధించి హింసిస్తుంటాడు. కోపం, అసహ్యించు కోవటం, ఇతరులకు కట్టుబడి ఉండటం, అనుకరించటం, వినయాన్ని ప్రదర్శించటం - ఇవన్నీ హింసా రూపాలే.

**కోపం :** కోపానికి మనిషిని ఒంటరివాడిని జేసే గుణమున్నది. కోపం తాత్కాలికంగా తనకు ఇతరులతో నున్న సంబంధాలన్నీ లేకుండా జేస్తుంది. కోపానికి ఒంటరితనపు ఛాయలేగాక తాత్కాలిక శక్తి గూడా ఉంటుందంటారు కృష్ణమూర్తి. కోపం రెండు రకాలుగా వస్తుంది. బాహ్య సన్నివేశాల వలన వచ్చే కోపం భౌతికమైన కోపం. అది త్వరగా రావటం వెంటనే పోవటం జరుగుతుంది. బాహ్యమైన అస్థిరతకు కోపం రావటం గూడా సహజమే. మరొకరకమైన కోపం ఆ కోపానికి కారణమైన దానిని ఎదుర్కోవాలన్న ఆలోచనతో వస్తుంది. అనుకున్నది జరుగక పోవటం వలన, అసూయవలన ఎదుటి వారిని దెబ్బ తీయాలన్న కాంక్షతోనూ వచ్చేకోపం తీక్షణంగా బయటపడి తననుతాను సమర్థించుకోవాలని చూస్తుంది.

మనిషి తననందరూ పొగడాలనుకుంటాడు. ఆశించింది జరుగనప్పుడు నిరాశ పడతాడు. క్రూరంగా అసూయ పడతాడు. తక్షణమే గాని, ఆలోచనపై ఆలోచన జేస్తూ గాని ఇతరులను దూషిస్తాడు. కోపం నిరాశలాగా, నిస్పృహలాగా, క్రూరతలాగా అసూయలాగా ఎన్నో రూపాల్లో కలుగుతుంది. అనుకున్నది జరుగక పోతే ఆశాభంగం

జెందటం, ఇతరులు తాననుకున్నట్లుండక పోతే తిట్టడం, అసూయపడటం, క్రూరంగా ఉండటం - యీ ప్రవర్తన మొత్తాన్ని హేతు బద్ధంజేసుకోవటం జరుగుతుంది. కోపం మనిషిని తనకనుకూలంగా, ఇతరులకు ప్రతికూలంగా తర్కించేట్లు జేస్తుంది గనుక కోపాన్నెదుర్కోవటం సహజంగా చాల కష్టమయింది. కోపాన్ని కోపంతో అసహ్యాన్ని అసహ్యంతో ఎదుర్కోవటం సబబనుకుంటాడు. ఆపైన తననుతాను సమర్థించుకోవ టంలోనూ, కోపానికి కారణాలను ఎదుర్కొనే కార్యక్రమంలోనూ ఎంతో శక్తిని కోల్పోతాడు.

**అసూయ (Jealousy)**: మనిషికి ఆహారం, బట్టలు, వసతివంటి భౌతికావసరాలు తీరినప్పుడు అవి కొంత మానసిక భద్రతనిస్తాయి. సాధారణంగా అందమైన దుస్తులు, ప్రత్యేకమైన ఇల్లు, తనకొక అంతస్థు, ఆధిక్యత అధికారం కావాలనుకుంటాడు. ఇతరులకున్న వాటితో తనకున్న వాటిని పోల్చి అసంతృప్తితో అసూయపడతాడు. తనకు ఎన్నెన్నో సొంత మవాలనుకుంటాడు. సంపాదించాలన్న కాంక్ష అసూయను పెంచుతుంది. మనిషి ఎంత అసూయపడితే అంతకావాలను కుంటాడు. సౌకర్యాలను అనుభవించి సంతోషపడతాడు. అన్నీ తనే పొందాలనుకోవటానికీ అసూయకు సంబంధముందంటారు కృష్ణమూర్తి.

**క్రూరత (Cruelty)** : కృష్ణమూర్తి అసూయ, కోపం మనిషిని క్రూరునిగా జేస్తాయంటారు. గొప్పవాడిని గావాలన్న ఆశయంగూడ మనిషిని క్రూరంగా జేస్తుంది. ఇతరులెవరైనా గొప్పవారు గావాలనుకుంటే తన కడ్డురాకుండా వారిని నెట్టేస్తుంది. ఈ క్రూరత ఒక అంటువ్యాధి.

మనిషికి దురహంకారం హెచ్చు. దానికితోడుగా భయంకరమైన అవినీతికి లోనవుతున్నాడు. రకరకాల సందర్భాల్లో మనిషి రకరకాల ముసుగులు వేసుకుని ఇతరులపై అధికారాన్ని చలాయించి క్రూరత్వాన్ని రకరకాలుగా వ్యక్తంజేసి అదే ధీరత అనుకుంటాడు.

ఇతరులను చంపటము బాధించటము గాక విడగొట్టడం గూడా హింసే! సాంఘిక నీతిని గుడ్డిగా అనుసరించటమే గాక తనస్వార్థం కోసం ఏర్పరచుకున్న ప్రత్యేకమైన నీతిని అనుసరించటం గూడా హింసే నంటారు కృష్ణమూర్తి.

మనిషి తన కోపాన్ని తగ్గించుకోవాలనుకున్నప్పుడు అది నాడీమండలం పైన

పనిచేసి సహజంగా శరీరంలో జరిగే రసాయనిక చర్యల్లో మార్పుదెస్తుంది. త్వరితంగా ప్రతిచర్యను ప్రోత్సహిస్తుంది. తనచుట్టూ ఉన్న ప్రపంచంలో జరిగే హింసలో తనవంతుగా తానూ పాలుపంచుకుంటున్నాడు. అంటే తన నిత్య జీవిత సరళికి కూడా తానే బాధ్యుడు. ప్రపంచంలో హింసను తొలగించటానికి గూడా మనిషి హింసాత్మక చర్యనే చేపడుతున్నాడు. హింస జరుగుతున్నప్పుడు అహింసను తలపోస్తాడు. అహింసనే భావిస్తాడు. లేదా హింసను అణచివేస్తాడు. లేదా మరొకదారికి మళ్ళిస్తాడు. అంటే హింసను మరొకరూపంలో వెల్లడిస్తాడు. ఈ దారిమళ్ళించే, అణచివేసే ప్రయత్నాలు హింసను ద్విగుణీకృతం జేస్తాయి కాని అంతం జేయలేవు. ఈ విధంగా హింసనుండి తాను విముక్తుడు గాలేక ఎవరిని విముక్తులను జేయలేక పోతున్నాడు.

## భయం (Fear)

జరిగిన దానికి జరుగుతున్న దానికి అంటే ఉన్న దానికీ కావాలనుకున్న దానికీ మధ్యనున్న ఘర్షణలో భయముంటుంది. వర్తమానపు క్షణాల్లో భయానికి ఆస్కారం లేదు. ధ్యాసలేనపుడు భయానికే తావుంది. మనిషి తన సహజశక్తులను కోల్పోయినప్పుడు భయం ఎన్నోరకాలైన సమస్యల్ని సృష్టిస్తుంది. అన్ని రకాలైన భ్రాంతులను మూఢతలను గలుగజేస్తుంది. సాహసించే శక్తిని, సృజనాత్మకమైన ఆలోచనను, అర్థం జేసుకునే ప్రజ్ఞను చంపుతుంది. మనసును హృదయాన్ని నిస్సత్తువగా జేసి మనిషిని కఠినునిగా జేస్తుంది. ప్రకృతి అందాలకు గాని ఇతరుల కష్టసుఖాలకు గాని స్పందింపనీయదు. భయమనే భూమికపై మంచితనం వికసింపలేదు.

గాఢమైన అనుభూతులైన సౌందర్యాన్ని ఆనందాన్ని ఆప్యాయతలను పోగొట్టుకోవటం వలన అతడికి భయభ్రాంతులు కలుగుతాయి. భయాన్ని కప్పిపుచ్చుకునే ప్రయత్నాలే పైపై పటాటోపాలూ, కొరగాని వేడుకలు, మొక్కుబడులు చెల్లించు కోవటాలూ ! భయాన్నుండి ఊహాప్రపంచం పుడుతుంది. మరణమంటే మనిషికి భయం. ఆ భయాన్నుండి బయటపడాలన్న ఆలోచన భయాన్ని పెంచి ఎన్నోరకాలుగా భద్రతను కోరుకునేట్లు చేస్తుంది. ఏ కోరికా లేకుండా సంపూర్ణ ధ్యాసతో వర్తమానంలో మనిషి జీవిస్తున్నప్పుడు మరణ భయముండదు అంటారు.

## సంఘర్షణ (Conflict)

మనిషి జీవితాన్ని తనకు తటస్థపడినట్లుగా అంటే యధాతథంగా స్వీకరింపడు. పాతఅనుభవాలతో బేరీజు వేసి హద్దు లేర్పరచి, జీవితంలో ఎన్నో అంచలుగా సంఘర్షణ పెంచుతాడు. భూత భవిష్యత్కాలపు ఆలోచనల ఫలితంగా వచ్చిన ఆశలు, నమ్మకాలు, వైఖరుల వలన ప్రభావితమైన మనిషి ఏదో కావాలనుకుంటాడు. ఉండటానికి, ఉండాలనుకోవటానికీ మధ్య మనిషి నిజస్వరూపానికి పైకి కనబడే దానికి మధ్య సంఘర్షణ ఉంటుందంటారు కృష్ణమూర్తి.

సంఘం లో మంచివానిగా కన్పించటం కోసం మనిషి ఎన్నో అబద్ధాలాడతాడు. ఆలోచించే దొకటి అనుభవించేదొకటి వ్యక్తంచేసేది మరొకటీ అయినప్పుడు అంతులేని సంఘర్షణకు గురవుతాడు. సైద్ధాంతిక పరమైన, స్వీయమైన - జాతిపరమైన సంఘర్షణలు, వృత్తిపరమైన, కుటుంబ పరమైన సంఘర్షణలూ యిలా ఎన్నో! సంఘర్షణ హద్దులనెక్కువ జేస్తుంది. అదొక విషవలయమవుతుంది. అంతులేని యీ సంఘర్షణ వల్ల పెరుగుదలలో గాని పురోభివృద్ధి గానీ - ఏవీ జరుగవంటారు కృష్ణమూర్తి.

మనిషి ఒక వాస్తవాన్ని మరొక దానితో పోలిస్తే ఒకదాన్ని తిట్టి మరొకదాన్ని మెచ్చి వేరొకదానితో సంబంధం పెట్టుకుంటుంటాడు. ఇలా సంఘర్షణలను ప్రేరేపించే మనిషి తనకుతానే శత్రువంటారు. మనిషి ఏదోసాధించాలని ప్రయత్నిస్తున్నప్పుడు అది సంఘర్షణకు దారి తీసినా మంచి వాతావరణాన్ని కల్పించటానికి తిరిగి ఆసంఘర్షణనే ఒక మార్గంగా ఉపయోగిస్తాడు.

భౌతిక సాంకేతిక రంగాల్లో వర్తమానపు వాస్తవాలను గతంతో పోల్చటం వలన, భవిష్యత్తును దృష్టిలో పెట్టుకుని ఆలోచన చేయటం వలనా భౌతికమైన అభివృద్ధి జరుగుతుంది. కాని మానసిక జీవితంలో పోల్చటం, ఎంపిక చేయటం తత్ఫలితంగా వచ్చిన సంఘర్షణలూ మానిసిక వత్తిడిని గల్గించి ఎంతో శక్తిని వృధా చేస్తాయి. దుఃఖాన్ని పెంచుతాయి. సంఘర్షణలు లేకుండా చేయటం సులభంగాదు. కొందరు సంఘర్షణకు ఆందోళనకు తట్టుకోలేక జీవితాన్ని ఎదుర్కోలేక వెనుకంజ వేసి శక్తి లేనట్లుంటారు.

## దు:ఖం (Sorrow)

నిన్నటిని పొడిగించేది ఆలోచన. ఈ ఆలోచన మానవ సంబంధాల్లో నమ్మకాలకు, ఊహా ప్రతిమలకు, ఒకదానితో నొకదానిని పోల్చటం వలన గల్గిన పరస్పర వ్యతిరిక్తతకు ఒంటరి తనానికి దారిదీసి దు:ఖాన్ని పెంచుతుంది. తనపై తనకు జాలి, ఒంటరితనం, భయం గల్గించి తనను తాను సరిపుచ్చుకునేందుకు, ఇతరులను దూషించేందుకు పురికొల్పుతుంది. దగ్గరయ్యే ప్రయత్నంలో ఓటమి సంభవించినప్పుడు దు:ఖం గలుగుతుంది. ఒంటరి తనపు బాధ తనపై తనకు జాలిని కలిగిస్తుంది. ఒంటరి తనాన్ని తప్పించుకోవాలనుకోవటం గందరగోళాన్ని దు:ఖాన్ని కలిగిస్తుంది. ఈ దు:ఖమే తనను తాను కాపాడుకునే మార్గాలను సూచిస్తుంది. దు:ఖపు కదలికలలో మనిషి తనమనసు ఏర్పరచుకున్న ఊహా ప్రతిరూపాలవైపు మరలుతాడు.

ఎదుర్కొని గెలవాలన్న ప్రయత్నంలో కొందరు క్రూరంగా తయారవుతారు. మరికొందరు దేనిమీదనైనా నమ్మకాన్ని ఏర్పరచుకుని దానిపై ఆధారపడి జీవిస్తుంటారు. వీటిలో ఏదీ సంపూర్ణమైన జీవితానికి దారితీయదు.

మనిషికి ఏదైనా సాధించాలన్న ఆశయంతో నున్నప్పుడు కష్టాలనెదుర్కోవలసి వచ్చినపుడు సమర్థుడెవరైనా తనను ముందుకు నడిపించాలనుకుంటాడు. మనిషి కష్టాలనుండి పారిపోవాలను కున్నప్పుడు అందుకు ఎందరో సహాయపడతారు. ఎవరో ఒకరు పరిష్కారాలను హేతుబద్ధంగా వివరిస్తారు. దైవభక్తి గాని త్రాగుడు గాని అలాంటి పలాయనం యేదైనా దు:ఖాన్ని అర్థం జేసుకోనీయదు. దు:ఖాన్నుండి, వాస్తవాన్నుండెంత పారిపోయినా దు:ఖం తప్పదంటారు కృష్ణమూర్తి. దుఃఖానికి కారణాన్ని వెతకటం శక్తిని వృధా జేస్తుంది. కారణమున్నప్పుడు ఫలితముంటుంది. ఆ కారణం మరోకదానికి కారణభూతమవుతుంది. ఈ గొలుసు చర్య ఇలాగే సాగిపోతుంది.

దు:ఖం ఆలోచనకు పదును బెడుతుంది. అయినా ఆలోచన మరింత దు:ఖాన్ని పెంచుతుంది గానీ తుడిచి పెట్టలేదు. దు:ఖానికి కారణం వెతకకుండా ఏ అధికారాన్ని అనుసరింపకుండా మనిషి ఇలా దు:ఖాన్నుండి ఒక్క మారుగా బయటపడగలడా? ఈ దు:ఖమనే దురవస్థనుండి ఎవరికి వారుగా వెనక్కుమరలే మార్గాన్ని కనుగొనమంటారు కృష్ణమూర్తి.

ఆలోచన చేతన కెన్నో రకాల సామగ్రిని చేకూర్చుతుందని 'నేను'ను పటిష్టం చేస్తుందని, జీవితపు రూపురేఖలు మార్చేసి నాశనం జేస్తుందని, భయాన్ని సంఘర్షణను, గందరగోళాన్ని హింసను, దు:ఖాన్ని సృష్టిస్తుందని తెలుసుకున్నాం. ఈ దైన్యతనుండి బయటపడటానికి కొందరు పరిసరాలలో మార్పును మరికొందరు సమాజనిర్మాణంలో మార్పును సూచించారు. మరికొందరు దైవాన్ని నమ్మకోమని బోధించారు. తత్ఫలితంగా సామాజిక పోకడలలో పలురకాల మార్పులొచ్చాయి గాని మానవుని స్థితిలో మాత్రం ఎట్టి మార్పు రాలేదు. ప్రపంచంలో ఎక్కడ చూసినా హింస అధికమవుతున్నది. పరస్పర అవగాహన, సహకారం, ప్రేమ కరువవుతున్నాయి. కనీసం బలవంతంగానైనా ఒకరితో నొకరం కలిసి పనిజేయలేక పోతున్నాం, ప్రతి మనిషి జీవితమూ అతనికి యితరులతో గల సంబంధాలపైనా, ప్రకృతితో గల సంబంధాలపైననే ఆధారపడి ఉన్నా అతడు మాత్రం అన్ని పనులూ తనకోసం మాత్రమే స్వార్థపూరితంగా చేస్తూనే ఉండటం దురదృష్టకరం. 'తాను ఒక ప్రత్యేకమైన వ్యక్తి గాదు'- అన్న ప్రత్యక్షజ్ఞానం కలిగినప్పుడే క్రియారూపంగా సహకరించటం సాధ్యమవుతుంది అంటారు కృష్ణమూర్తి. అంతటి ప్రత్యక్షజ్ఞానం గావాలంటే నిబద్ధమైన మనసు పనికిరాదు. అందుకు అలవాటు ప్రకారం గాకుండా అవధానతతో వినాలి. పరిశీలించాలి, ప్రశ్నించాలి, నేర్చుకోవాలి. నిరంతరం జరిపే ఇంద్రియకార్యాల గురించి పూర్తి ఎరుకతో నుండాలి.

## ప్రశ్న - విచారణ

అంతర్గత బహిర్గత విషయాలను మెళుకువతో అభ్యసించటానికి, స్పష్టంగా సంపూర్ణంగా విచారణ జేయటానికి ప్రశ్నించాలని, పరిశోధించాలని కృష్ణమూర్తి అంటారు. కనిపించకుండా దాగి ఉన్న విషయాలనెన్నింటినో ప్రశ్నిస్తూ, పరిశోధిస్తూ వీరు వెలికిదెచ్చారు. వీరి ప్రశ్నలు ప్రతి ఒక్కరి అంతరంగ విచారణకు స్వంత ఆలోచనకు సహాయపడతాయి. చిన్నా పెద్దా అన్న భేదం లేకుండా జీవితంలో ఎదురైన ప్రతి విషయాన్ని అవధానం జేయమంటారు. విచారణజేస్తూ, తప్పులను గ్రహిస్తూ తొలగించాలంటారు. కేవలం ప్రశ్నించటమే చేసినప్పుడు ప్రయోజనముండదని ఎవరిని వారు ప్రశ్నించుకుంటూ దాన్ని ఆసాంతం పరిష్కరించేవరకూ వదలకుండా విచారణజేయడమే పరిశోధనని అంటారు. గుడికి వెళ్ళటంకంటే, చంద్రగ్రహంపైకి వెళ్ళటం కంటే అంత:పరిశీలన

పరిశోధనలు ఎంతోముఖ్యమంటారు.

అంటే నిజమైన శాస్త్రజ్ఞుడు ఫలితాన్ని ఆశించకుండా, ఏ విధంగా పరిశోధిస్తాడో ఆ విధంగా పరిశోధించాలి. ప్రతి ఒక్కరిని, పుస్తకాలలో నున్నదాన్ని, రాజకీయ వాదులు, మతాధికారులు చెప్పినదాన్ని ప్రతిదానినీ ప్రశ్నించాలి. సాధారణంగా ప్రశ్నించటమంటే ఒక తిరుగుబాటు అనుకుంటాం. అంటే జరుగుతున్న ఒక చర్యకు ప్రతిచర్యన్న మాట. కాని ప్రతి చర్య అర్థహీనమైనది.

బాహ్యావిప్లవాలు, మతవిప్లవాలు, ఆర్థికవిప్లవాలు ఎన్ని వచ్చినా అవి మానవ జీవితంలో తెచ్చిన మార్పులు బహుతక్కువ. 'ఈ విప్లవాలు అవసరమేమో గాని లోతైనవి గావు. పాతవాటి బదులు క్రొత్తవి మళ్ళీమళ్ళీ వస్తూంటాయి' అంటారు కృష్ణమూర్తి. ఒకదానికి విరుద్ధంగా విప్లవించినప్పుడు ఆ విప్లవం మనిషిని నియంత్రించి, మార్చివేసి, అణచివేసి, ఎదురుతిరిగేట్లు జేసి మరొకరకంగా మనిషిని ఎంతో క్రూరంగా మోసకారిగా చేస్తున్నది. మనిషికున్న అనుభవము, స్థాయి, అధికారము ప్రశ్నించటానికి, పరిశోధించటానికి దోహదం జేయలేవు.

'విచారణ అంటే పరిశోధన ఒక నీటిజల వంటిది. ఇది నిరంతరం జరుగుతూనే ఉంటుంది. పరిశోధనలో సంతృప్తిని ఆశించరాదు. బాహ్యంగాగాని, అంతరంగికంగా గాని ఎంతో కొంత సాధిస్తూనే వున్నా ఆజ్వాల సమసిపోటు'. అంటారు కృష్ణమూర్తి. ప్రశ్నిస్తూనే వీరుజేసిన పరిశోధనలోనే ఆలోచన యీ ప్రపంచంలో దుస్థితికి, దు:ఖానికి ఎలా బాధ్యులో, ఆలోచన మూలంగా కలిగిన భయం ఎంత హింసను సృష్టిస్తుందో, మానవాళికి ఎంత ఆపదను తెస్తున్నదో, మానవుడు సృష్టించుకున్న ఆచారాలు, సామూహిక ఆలోచనలు వర్తమానంపైన ఏవిధంగా మానవాళికి ఎంతమాత్రం శ్రద్ధ లేకుండా జేస్తున్నాయో తెలిసింది. ఇట్టి పరిశోధన ప్రతి ఒక్కరికీ సాధ్యమే నంటారు వీరు.

విద్యార్థులను ప్రశ్నించమంటారు వీరు. ప్రత్యక్షంగా గ్రహిస్తూ వేసే ప్రశ్నలోనే సమాధానమూ ఇమిడి ఉంటుందంటారు. జీవితాంశాలను స్పృశిస్తూ విలువైన దాన్ని గ్రహింపమంటారు. విద్యార్థుల్లో నున్న సహజమైన కుతూహలాన్ని నిరుత్సాహపరచకుండా వారి ప్రశ్నలను ఉపాధ్యాయులు గ్రహించి, వారితో చర్చించి, విద్యార్థుల సహజ వికాసానికి దోహదం జేయాలంటారు.

# ప్రత్యక్ష జ్ఞానము (Perception)

జరుగుతున్నదానిని ఉన్నదున్నట్లు యదార్థంగా గ్రహించటమే ప్రత్యక్షజ్ఞానం. అంటే తీక్షణతతో సంపూర్ణంగా గ్రహించటం. ఇంద్రియాలన్నింటితో హృదయంతో మనసుతో తనకున్న శక్తి యంతటితో వాస్తవాన్ని దర్శించటం. ఈ జ్ఞానం కాలంపైన ఆధారపడదు. మనం సాధారణంగా 'నేను' అనే కేంద్రంనుండి చూడటాన్ని గూడా ప్రత్యక్షజ్ఞానమని పొరపడుతుంటాం. అంటే అనుభవాలు, వాటితాలూకు జ్ఞాపకాలు ఆలోచనలు జరుగుతున్నదానిని గుర్తిస్తూ, బేరీజువేస్తూ, రకరకాలుగా విభజిస్తూ, పేరుబెడుతూ, వ్యతిరేకిస్తూ, అవునంటూ కాదంటూ ఎన్నొరకాల ఆలోచనలతో విశ్లేషించగా ఏర్పడిన జ్ఞానం. ఈ గందరగోళంలో స్వచ్ఛమైన జ్ఞానం గలుగదు. పైగా ఎంతోశక్తి వ్యయవుతుంది.

మనిషికి ఏదైనా సమస్య వచ్చినపుడు కలిగే ఆందోళన నిశబ్దపరిశీలనను నిరోధిస్తుంది. సమస్య ఎదురైనపుడు దాని భయంలో చిక్కుకున్న మనిషి సమస్యా పరిష్కారాన్ని కోరుతూ అందుకు ప్రయత్నిస్తాడు గానీ సమస్యను ఆసాంతం అర్థం జేసుకోవాలని ప్రయత్నింపడు. తెలివితేటలతో సమస్యను విశ్లేషించి వివరించటానికి ప్రయత్నిస్తాడు. 'నేను' అనే కేంద్రాన్నుండి వివేచన జరుపుతాడు. అది అవగాహనను వక్రీకరిస్తుంది. సమస్యను వదిలించుకోవాలని, దాని నుండి పారిపోవాలనీ, అణచి వేయాలని, దాని స్థానంలో వేరొకదానిని కనుగొనాలనీ ప్రయత్నిస్తాడు గాని సమస్యను గ్రహింపడు.

వ్యవస్థా పరమైన సమస్యలు, వ్యక్తిపరమైన సమస్యలు జీవితాన్ని క్లిష్టంగా జేస్తున్నాయి. వ్యవస్థాపరమైన సమస్యలెన్నింటికో పరిష్కారాలు దొరుకుతున్నాయి గాని వ్యక్తి పరమైన సమస్యలకు దొరకటం లేదు. అందుకే ముందుగా అన్నింటికి మూలమైన 'నేనును' అర్థం జేసుకోవాలి. కాని 'నేను' గురించిన జ్ఞానాన్ని పేర్చుకుంటూ పోయినపుడు అదిచేతనకున్న భారాన్ని పెంచుతుంది. జ్ఞానాన్ని ప్రోగుచేసుకొని (accumulation of Knowledge) నిత్యమూ ఒక తీక్షణతతో ప్రత్యక్షంగా తనను తాను కనుగొనాలి, తనను తాను అర్థం జేసుకునే మనిషి జీవితంలోనున్న సమస్యలను అర్థం జేసుకోగలడు. లేకుంటే తన జీవితాన్ని సంపూర్ణంగా జీవించటంలో ఓడిపోతాడు. బాహ్యంగా వస్తువులను, అంతర్గతంగా అంతులేని సమాచారాన్ని ప్రోగుచేసుకుంటూ ఆ ఖాళీని భర్తీ జేసుకుంటాడు.

తాను ఏదో కావాలనుకుంటూ, తనప్రస్తుత పరిస్థితిని కప్పిపుచ్చుకుంటూ కృత్రిమమైన శాంతి కోసం ప్రయత్నిస్తూ ఏదో ఒక విధానంలో చిక్కుకుంటాడు.

భూతకాలపు బరువులో, భవిష్యత్కాలపు ఆశలో చిక్కుకోని మనిషి సమస్యను సూటిగా ఎదుర్కొని పరిష్కరింపగలడు. భూత వర్తమాన భవిష్యత్కాలాలు ఒక్కటిగా వర్తమాన క్షణాలలో ఉన్నప్పుడు అంటే నిన్న అన్నది నిశ్శబ్దంగా ఉన్నపుడు రేపటిపై ఆశలేనపుడు మనిషికి స్వచ్ఛమైన గ్రహణ శక్తి ఉంటుంది. అప్పుడు సమస్యా పరిష్కారంగూడా సుసాధ్యమవుతుంది. వర్తమానంలో జీవించేవానికి వాస్తవ సమస్య చక్కగా గోచరిస్తుంది. మనిషి రకరకాలుగా కోరికలతో మునిగిపోయినపుడు, తన ఊహారూపాలకు, నమ్మకాలకు, ఆశయాలకు, ఆర్జించిన జ్ఞానానికి, ఎన్నోరకాలైన అధికారాలకు, భవిష్యత్తుపై ఆశలకు నిబద్ధుడుగానప్పుడే ఇట్టి గ్రహింపు సాధ్యమవుతుంది. తాను ఎవరితోను, ఏ సిద్ధాంతాలతోను తాదాత్మ్యమొందనప్పుడు, ఎవరిపైనా మానసికంగా ఆధారపడనప్పుడు, ఒంటరివాడై బేంబేలు పడనప్పుడు, ఎవరితోనూ పోల్చుకోనప్పుడు, దేనికీ భయపడనప్పుడు, ఎవరిపట్లా అసూయజెందనపుడు, సంఘర్షణకు లోనుగానపుడు, ఏదో ఒకదానికి బద్ధుడవనప్పుడు ఉన్నదానిని ఉన్నట్లూ గ్రహింపగలడు. ప్రత్యక్షజ్ఞానము జీవితవిధానములో అనూహ్యమైన మార్పును తెస్తుంది. ఎంతమాత్రమూ కాలయాపన జరుగక వెన్వెంటనే అవగాహన కలుగుతుంది.

ఇంద్రియానుభవం కలుగుతూ ఉన్నప్పుడే ఆలోచనలు చొరబడితే ప్రత్యక్షజ్ఞానాన్నెంత కలుషితం జేస్తాయో చూడమంటారు కృష్ణమూర్తి. ఇంద్రియానుభవం గలుగుతున్నపుడు ఈ అనుభవాన్ని పాతఅనుభవంతో పోల్చటానికి ఆలోచన ఏరకంగా తొందరపడినా ఎంతమాత్రము తొందరపడినా ప్రత్యక్షజ్ఞానం సాధ్యమవదు. మనస్సు నిశ్శబ్దంగా ఉన్నప్పుడు అంటే ఏ ఆలోచనా లేనప్పుడు ప్రత్యక్షదృష్టి అంటే ప్రత్యక్ష జ్ఞానం కలుగుతుంది. సంపూర్ణమైన స్వచ్ఛమైన దృష్టి సారించి గ్రహించిన దానిని విశ్లేషించటానికి ఆలోచన సాగించవచ్చు గాని ఇంద్రియానుభవము గలుగుతున్నప్పుడే గాదు.

సంపూర్ణదృష్టి ఉన్నప్పుడు ఉన్నదున్నట్లు చూడటానికి శక్తి పూర్తిగా ఉపయోగపడుతుంది. పూర్తి అవధానతలో ఆలోచనల వరదనుండి బయటపడే అవకాశమున్నది. ఏ నైతిక, ధార్మిక, సాంఘిక సూత్రాలపైనా ఆధారపడకుండా, వాటి ప్రభావం లేకుండా ఉన్న క్షణాలలో మనిషిలో గలిగిన సున్నితత్వం వాస్తవాన్ని గ్రహించ టానికి దోహదం జేస్తుంది. నిర్ద్వంద్వమైన ప్రత్యక్షజ్ఞానం స్పష్టమైనది. స్వచ్ఛమైనది. ఆ

స్వచ్ఛతలో, పూర్ణతలో అంతటా ప్రవహించే శక్తి మహోన్నతమైన ప్రజ్ఞను మేల్కొలుపుతుంది. ప్రత్యక్షంగా ఉన్నదున్నట్లు గ్రహించినప్పుడు చేసేపని కూడా సవ్యంగా ఉంటుంది. మంచి సంబంధాలూ ఏర్పడతాయి. తనకున్న ప్రత్యక్షజ్ఞానమూ తాను జరిపేక్రియా వేర్వేరు గావు. ప్రత్యక్షంగా యదార్థాన్ని గ్రహించటమేగాక వదిలివేయటంగూడా జరుగుతుంది. క్షణక్షణం ప్రత్యక్షంగా గ్రహించుతున్నప్పుడు జ్ఞాన రూపంలో ప్రోగుబడదు గాబట్టి జరుగబోయేదానిని నిబద్ధం జేయదు.

ఇంద్రియాలను, హృదయాన్ని, మనసును ఉపయోగించి మనిషి జీవితంలోనున్న పరస్పర విరుద్ధతను దాని పర్యవసానాన్ని ప్రత్యక్షంగా గ్రహించినప్పుడు భూత భవిష్యత్కాలాలకు కట్టుబడక ఒక వాస్తవాన్నుండి మరొక వాస్తవానికి కదలిపోగలడు. సమాజం నిర్దేశించిన విలువల ప్రకారమే మనిషి జీవించనవసరం లేదు. తాను జీవితపు విలువ లేమిటో తెలుసుకుంటే అప్పుడు జీవితానికి విలువలకు బేధముండదు. జీవితం నిత్యనూతనమైనది గనుక మంచి విలువలని చెడ్డ విలువలని బేరీజువేసి అందరికీ వాటినే అందించాలనుకోవటం సబబుగాదంటారు కృష్ణమూర్తి.

విద్యాలక్ష్యాలలో ఒకటి శాశ్వత విలువలను కనుగొనటము. సత్యాన్ని గ్రహించాలనుకునే ఉపాధ్యాయులకు విద్యార్థులకు వాస్తవాల పట్ల ప్రత్యక్ష జ్ఞానం కలగటానికి మార్గాలయిన వినటం, పరిశీలించటం, నేర్చుకోవటం అనే కళలను ఆలోచన ఎంతగా నిబద్ధం జేసి యాంత్రికంగా మార్చిందో స్పష్టంగా చూపుతారు.

## అవధానత (Attention)

మనిషికున్న అవధానత అతనిని పరిశీలనకు సిద్ధం జేస్తుంది. చూడబడే వస్తువు, దాని పరిమాణం, దానిలో కనిపించే మార్పు, పరిసరాల్లోని తేడా, చూసే మనిషికున్న అలవాట్లు అతని అవధానతను ప్రభావితం జేస్తాయంటారు మనస్తత్వవేత్తలు. అంటే చూసే వాని దృష్టిని, చూసిన తరువాత జరగవలసిన చర్యను గూడ యీ అవధానతే ప్రభావితం చేస్తుంది. సంపూర్ణ అవధానతలో గతించిన విషయాలు గాని వాటి ఆలోచనలు గాని వర్తమానం పై నున్న దృష్టిని ఆటంక పరచలేవని అవధానత అసంపూర్ణమైనప్పుడే ఆలోచన ఆటంకపరుస్తుంది గనుక అవధానతకు అడ్డుపడుతున్న వేవో పరిశీలింపమనీ అంటారు కృష్ణమూర్తి.

అవధానతకు ఏకాగ్రతకు మధ్యనున్న లక్షణాత్మక తేడాను కృష్ణమూర్తి చూపుతారు. ఒక దానిని ఏకాగ్రతతో గమనించాలనుకున్నప్పుడు పరిపరివిధాల పోయే ఆలోచనలను ఒక్కచోటికి లాగి అదుపుచేయాలి. అవసరం లేదనుకున్న ఆలోచనలనెన్నింటినో అణచివేయాలి. ఏకాగ్రతకోసం చేసే యీ ప్రయత్నాలలో ఎంతోశక్తి వృధా అవుతుంది. మనిషిలో సగటున 90 శాతం శక్తి వృధా అవుతున్నదని మానసిక శాస్త్రవేత్తలు, విద్యావేత్తలు వ్యాకుల పడుతున్నారు. కృష్ణమూర్తితో పాటు పూర్తిగా అవధానత ఏదో చూడగల్గితే ఆందోళనకు పరిష్కారం తోస్తుంది.

అవధానతంటే కొన్ని వద్దని కొన్ని కావాలని అనుకోవటం కాదు. వద్దనుకున్న దాన్ని బయటకునెట్టాలనుకోవడమూ కాదు. అలాకుదుర్చుకున్న ధ్యాస శక్తినంతటినీ ఒక్కదానికే పరిమితం జేసి దాన్నే పట్టుకొని వ్రేలాడుతుంది. అలా శక్తిని ప్రోగుజేసుకొనే ప్రయత్నాలలో అటుఇటు తిరిగే ఆలోచనల్తో ముడిబడి పోతుంటుంది. నిజానికి అవధానతలో ఆలోచనకు తావు లేదు. ఏవిధమైన అంతర్గత బహిర్గత ఆలోచనల్లోనూ మునిగి పోనప్పుడే బలవంతంగా ఏకాగ్రత కోసం కృషి చేయనప్పుడే అవధానత ఉంటుంది. ఒక పనిలో ప్రవేశించి అంతర్గత ప్రేరణలో నున్నపుడు ఎట్టి సంఘర్షణా లేనపుడు చుట్టు ప్రక్కల జరిగే వాటి గురించి ధ్యాస ఉండదు. ఉదా : సూర్యోదయాన్ని చూస్తున్నప్పుడు కదిలేజంతువును గమనిస్తూన్నప్పుడు గాఢమైన అవధానముంటుంది. ఆ అవధానతలో ఏకాగ్రత గూడా ఉంటుంది, ఈఏకాగ్రత బలవంతంగా కుదుర్చుకున్నది గాదు. అటువంటి సంపూర్ణ అవధానతలో ఏ సమస్యనైనా పూర్తిగా గ్రహించవచ్చు. ఆ స్థితిలో 'నాకు అవధానత ఉన్నది' అని చెప్పటానికి 'నేను' అనేధ్యాస ఉండదు. అంటే 'నేను' అన్నది లేని అవధానతలో తానుకానిదేదో కావాలనుకోవటం, పొందాలనుకోవటం ఉండవు. అవధానతలో దేహానికి మనసుకు హృదయానికి మధ్య ఎలాంటి దూరమూ సంఘర్షణ ఉండవు. అలాంటి అవధానత ఉన్నప్పుడు శక్తి వృధాగాదు. పైగా అశక్తి అంతా ఉపయోగపడి మనముందున్న విషయము ఆసాంతముగా గ్రాహ్యమవుతుంది.

సాధారణంగా మనిషి తనకింతకు ముందేర్పడిన జ్ఞానంతోనో లేక పక్షపాత దృష్టితోనో పోలిక అనే తూకం వేస్తూ తెరల మాటున చూడటం వినటం జరుగుతుంది. తాను చూస్తున్న వాటిని పేరుపెట్టాలన్న తొందరలో జరుగుతున్న దాన్ని పూర్తిగా

చూడడు వినడు. తాను విన్నకొద్ది పాటివాటినే వివరిస్తుంటాడు. వాటికి సంబంధించిన ఊహల్లో జ్ఞాపకాల్లో ఆనందాన్ని గానీ అశాంతిని గానీ అనుభవిస్తుంటాడు.

అసంపూర్ణమైన అవధానత ఆవిధంగా భూతభవిష్యత్తులను అంటే మానసిక కాలాన్ని సృష్టిస్తుంది. ఆ జ్ఞాపకాలతో ఊహలతో మనసును నింపుతుంది. పూర్తి అవధాన తున్నప్పుడు మెదడు అనుభవాలను ముద్రింపదు. ఆలోచన అంతమై మనసు నిశ్శబ్ద మవుతుంది. ఆ నిర్ద్వంద్వ (అద్వైత) నిశ్శబ్దస్థితిలో అవధానత వెలుగులో సత్యం గోచరిస్తుందంటారు కృష్ణమూర్తి.

ఉపాధ్యాయునికి చెప్పాలని విద్యార్థికి నేర్చుకోవాలని 'ఆకాంక్ష' ఉన్నపుడే అవధానత ఉంటుందంటారు కృష్ణమూర్తి. కనుక బడిలో అందుకు తగిన వాతావరణాన్ని సృష్టించాలి. విద్యార్థుల్లో కుతూహలాన్ని రేకెత్తించే సహజవాతావరణాన్ని ఏర్పరచి వారి అభ్యసనకు మూలమైన అవధానతను ఇనుమడింపజేయాలి.

సాధారణంగా పాఠ్యవిషయాల జ్ఞానంతో విద్యార్థుల బుర్రల్ని ఉపాధ్యాయులు నింపాలనుకుంటారు. నింపుతారు. కాని వారి పూర్ణ వికాసాన్ని సంబంధబాంధవ్యాలనూ అశ్రద్ధ చేస్తారు. వారిలో ఏకాగ్రత వహించే శక్తినే పెంపొందించాలనుకుంటారు. ఏకాగ్రత కోసం ఎన్నో కాదనుకుంటూ మెదడును పరిమితంగా ఉపయోగించుకునేట్లు చేస్తారు.

అవధానత లేని స్థితిని పరిశీలిస్తే ఆలేని స్థితే అంతమవుతుందంటారు కృష్ణమూర్తి. అవధానతలేకపోవటమనేది సహజంగా అంతమవటానికి ఇట్టి నిర్ద్వంద్వ పరిశీలనే ఆరోగ్యకరమైన మార్గం. ఉపాధ్యాయుడు సున్నితంగా ప్రేమగా వ్యవహరిస్తూ వారి విద్యార్థులు తమకు ధ్యాసలేక పోవటాన్ని గ్రహించి ధ్యాసవహించేట్లు చేయాలి. కాని బలవంతంగా ఏకాగ్రతను కుదిర్చే ప్రయత్నాలు చేయరాదు.

విద్యార్థులకుండే వివిధ అభిరుచులకు అనుగుణంగా ఉపాధ్యాయుడు అవకాశాలు కల్పించినప్పుడే పూర్తి అవధానతతో వాటిని నేర్చుకోవటానికి వారికున్న సామర్థ్యాలను ఉపయోగించుకో గలరు. ఏ కృత్రిమ ప్రేరణ లేకుండా పూర్తి అవధానత ఉన్నప్పుడు ప్రజ్ఞ మంచితనం వికసిస్తాయి. అట్టి వికాసంతో విద్యార్థులు గూడా తమకు తగిన వృత్తులనే ఎన్నుకుంటారు. వారి ముందు సరైన జీవితమే ఉంటుంది అంటారు కృష్ణమూర్తి.

## ఎఱుక (Awareness)

ప్రతిక్షణం తనలో జరుగుతున్నదేమిటో నిర్ద్వంద్వంగా గ్రహించటమే ఎరుక. ఏ లక్ష్యానికి కట్టుబడక ఉన్నమానసిక స్థితిలో జరిగే పరిశీలనలోనే యీ ఎరుక సాధ్యం. చూచిన దానిని గాని, విన్నదానిని గాని మార్చటానికి ప్రయత్నింపక, ఏదో ఒక మార్గానికి మళ్ళింపక, ప్రోత్సహింపక ప్రత్యక్షంగా గ్రహిస్తూ ఉన్నప్పుడే యిట్టి ఎరుకకు అవకాశముంటుంది. బాహ్య అంతర్గత కదలికలు ఒకదానికొకటి ప్రతిస్పందింపక ఏకమయినప్పుడు ప్రజ్ఞాప్రభావితమైన చేతన ఒకప్రతి చర్యగా గాక చర్యగా బహిర్గత మవుతుంది. ఇట్టి అంతశ్చేతన గురించిన ఎరుకే సున్నితత్వం. ఒక విషయం పట్ల గల ఏకాగ్రతలో పూర్తిగా మునిగిపోయినపుడు పరిశీలనాదృష్టి పరిమితమవుతుంది. ఈ పరిమితిని ప్రశ్నించటానికి, ఆ పై అందుకు భిన్నమైన ప్రత్యక్ష జ్ఞానాన్ని పొందటానికి సున్నితత్వమే సహాయపడుతుంది. ఆ సున్నితత్వమే తన గురించి తనకు గల జ్ఞానంలోనూ తనకు ఇతరులతో నున్న సంబంధాలలోనూ కన్పిస్తుంది.

పూర్ణమైన ఎరుక నిరంతరం సాధ్యంగాదంటారు. నిరంతరం ఎరుకతో నుండటం సాధ్యం గాదని తెలుసుకోవటము గూడా అవధానత అంటారు. మనిషి బాహ్యంగా జరుగుతున్న వాటినన్నిటిని తెలుసుకోలేడు. కాని తన అంతరంగిక జీవితాన్ని పూర్తిగా తెలుసుకోగలడు. తనను తాను మోసపుచ్చుకోనప్పుడు తనలోనున్న దాన్ని ఆసాంతమూ గ్రహింపగలడు. ఎంతో లోతులకు పోయి ఎంపికలేని ఎరుకనూ పొందగలడు. ఎట్టి లక్ష్యము లేకుండా నిత్యం తనను తాను పరిశీలించుకోగల్గినప్పుడే ఇట్టి ఎరుక సాధ్యం.

ఎరుకగలిగిన వానికి చుట్టూ ఉన్న కొండలు, చెట్లు ప్రకృతి గురించి శ్రద్ధ గలుగుతుంది. కేవలం తన గురించిన ధ్యాసే వున్నప్పుడు తన పరిసరాలను స్పష్టంగా గ్రహించలేడు. సంపూర్ణమైన ఎరుక దేనినీ వెలివేయదు. ఎరుక గల్గిన మనిషి తన ఆనందాన్ని విచారాన్ని కోరికను ఒంటరితనాన్ని విసుగునూ గూడ అవుననక, కాదనక, తూలనాడక నిర్ణయింపక, ఎట్టి ఎంపికా జేయకనే చూడగలడు. అట్టి ఎంపిక లేని ఎరుకలో సంఘర్షణ గాని కాలప్రమేయం గాని లేని స్థితిలో సత్యానికి వాకిలి తెరువబడు తుందంటారు కృష్ణమూర్తి.

# పరిశీలన (Observation)

కృష్ణమూర్తి అంతరంగ పరిశీలనలో ఉన్నదన్నట్లుగా చూడటంలోని గొప్ప అందాన్ని కనుగొన్నారు. చూస్తున్న దాన్ని దేనితోనూ పోల్చవద్దని, అంచనావేయవద్దనీ, న్యాయనిర్ణయం చేయవద్దని, ఏ విధమైన విశ్లేషణా చేయవద్దనీ అంటారు. అంతమాత్రాన ఉన్నదున్నట్లు అంగీకరించటం తగదంటారు. ఉన్నదానిని వద్దను కోరాదని, దాన్నేదో ఒకటి చేయాలను కోరాదనీ గూడా చెప్తారు. క్షణక్షణం మారిపోయే యీ జీవితంలో సాధారణంగా మనిషి తానుచూసిన దాన్ని వెంటనే మరొకదానితో పోల్చి నిర్ధారించి దాని గురించి ఒక భావాన్నేర్పరచుకుని ఒకపని చేయటానికి సిద్ధమవుతుంటాడు గాని సంపూర్ణ పరిశీలన కవకాశమీయడు గదా!

గతానికి నిబద్ధంగాకుండా చేసే పరిశీలన భౌతిక శాస్త్రజ్ఞులు ప్రయోగాలతో కనుగొన్న యదార్థాలకు సాటిగా ఎన్నో మానసిక యదార్థాలను వెల్లడిస్తుంది. పరిపూర్ణంగా విస్తారంగా జేసిన కృష్ణమూర్తి పరిశీలనలో మానవ జీవితానికి సంబంధించిన సత్యాలెన్నో బహిర్గతం అయ్యాయి. అంతేగాక ప్రయోగశాలలో మానసిక శాస్త్రజ్ఞులు కనుగొన్న విషయాలను మించిన శ్రేష్టత యీ పరిశీలనలో గోచరించిన సత్యాలకున్నదని చెప్పక తప్పదు.

ఆత్మపరిశీలనలో తన గురించి తానేమనుకుంటున్నదీ ఇతరులేమను కుంటున్నదీ తెలిసికోవాలన్న ప్రయత్నముండదు. తానెలా ఉన్నదీ ఆసాంతం తెలిసికోవటమే ఆత్మ పరిశీలన. ఈ పరిశీలన ఒక నిర్ణీత పద్ధతి ననుసరించి జరుగదు. అంటే అప్పుడు పరిశీలన చేస్తున్నవాడు 'ఔనంటూ' స్వాధీన పరచుకోవటమూ జరుగదు. 'కాదంటూ' అణచివేయటమూ జరుగదు. పరిశీలించేవాడూ పరిశీలింపబడేదీ లేని నిర్ద్వంద్వ స్థితిలో పరిశీలన జరుగుతుంది. అట్టి పరిశీలనలోనే శక్తి అంతా సమకూడుతుందంటారు కృష్ణమూర్తి.

'నేను' అన్నకేంద్రం ఎక్కడ లేకుండా పోతుందోనన్న భయంలో 'నేను' అన్నదాన్ని పటిష్టం జేసుకునే ప్రయత్నముంటుంది గాబట్టి ఎవరినివారు పరిశీలించుకోవటం కష్టమే. అందుకే ముందుగా వ్యక్తితో ప్రమేయం లేని సన్నివేశాలను, చెట్లను, కొండలను ఎటువంటి ఊహారూపాలూ కప్పివేయకుండా పరిశీలన చేయమంటారు. ఆవిధంగానే 'నేను' అన్న కేంద్రం లేకుండా తననుతాను పరిశీలించు కోమంటారు. భౌతిక ప్రపంచాన్ని పరిశీలించి అర్థంజేసికోవటం కంటే తనకు తెలిసిన మనుషులను పరిశీలించటం తననుతాను పరిశీలించుకోవడం కష్టం.

తనను తాను పరిశీలించుకోవటంలో గూడా ఒకసారి చూసింది మరొకసారి చూసే దానికెప్పుడూ సమానం గాదు. సాధారణంగా మనిషి స్వీయ పరిశీలనా ఫలితాలను ప్రోగుజేసుకుని సిద్ధాంతాలను రూపొందిస్తుంటాడు. కానీ జరుగుతున్న వాస్తవ పరిశీలనను అంతకు ముందు సంపాదించిన అనుభవం ఆటంక పరుస్తుంది. భూతకాలానికి సంబంధించిన మనసు సంఘర్షణకు లోనయి శక్తిని వృధాజేస్తుంది. నిత్య చైతన్యవంతమైన జీవితాన్ని అందలి అంశాలను ఒక అలవాటుగా మాత్రమే పరిశీలిస్తున్నప్పుడు మనిషి తనకున్న శక్తిలో అతికొద్ది శక్తిని మాత్రమే ఉపయోగించుకుంటాడు.

మనిషి తన జీవితాన్ని ఒక అలవాటుగా గాక నూతనోత్సాహంతో శ్రద్ధతో సున్నితంగా అప్పుడే చూస్తున్నట్లు నిశ్శబ్దంగా పరిశీలిస్తే మెదడు అపరిమితమైన చురుగ్గా వుంటుంది. అందుకు శారీరక మానసిక శక్తుల సమ్మేళనంతో చేసే పరిశీలన అవసరం. ఆ నిశ్శబ్ద పరిశీలన అంటే చూడబడేది, చూసేవాడు అన్న ద్వంద్వం లేనప్పుడు జరిపే పరిశీలనే ధ్యానపు వెలుగు. అప్పుడే ఎరుక గల్గుతుంది. అనగా పూర్తి స్వేచ్ఛలో జరిపే పరిశీలన వలన అంతా తేటతెల్లమవుతుంది. స్వేచ్ఛలో సున్నితమైన మనసు చురుగ్గా వుండి అన్నింటినీ సూక్ష్మంగా పరిశీలింప గలదు. అంటే మనసు నిశ్శబ్దం.గా ఉన్నప్పుడు మెదడు నిశ్చలంగా ఉన్నప్పుడు జరిగే ద్వంద్వంలేని పరిశీలనతో గతాన్ని గురించీ భవితవ్యాన్ని గురించీ విచారణ లేదు. ఇంద్రియాలన్నీ సంపూర్ణ స్ఫూర్తితో ఉన్నప్పుడు పూర్తి శక్తి వెలువడి విలువైన అవగాహన ఏర్పడుతుంది. నిర్ద్వంద్వ స్థితిలో ప్రకృతిని పరిశీలించినప్పుడు అహం పెరగక పోగా కరిగిపోతుంది. ఆ స్థితిలో అసహ్యతనో, కోపాన్నో పరిశీలించినప్పుడు అవి వికసించి సహజంగా దూరమవుతాయి. అప్పుడు జీవనక్రియ గ్రాహ్యమయి చూట్టూవున్న వాటిపై ప్రేమ దయగలుగుతాయి. నిజానికి ఇదే వైజ్ఞానిక పోకడగల ధార్మికమైన స్ఫూర్తి. ఇది జీవితాన్ని ప్రభావితం చేసి బాహ్యసంబంధాలనూ అంతరంగాన్నీ మార్చివేస్తుంది. నిత్యజీవితానికీ, సాంకేతిక అభివృద్ధికి యిది ఏ మాత్రం విరుద్ధముగాదు.

"విద్యంటే పుస్తకాలు చదివి యదార్థాలను జ్ఞాపకముంచుకోవటమే కాదు. పుస్తకాల్లో చెప్పిన దెలా చూడాలో వినాలో నేర్చుకోవటముగూడా విద్యే. సత్యమేదో అసత్యమేదో గ్రహించాలి' అంటారు కృష్ణమూర్తి. ప్రపంచ వ్యాప్తంగా విద్యంటే జ్ఞానార్జన

జేయటమని, పరీక్షలు పాసవటమనీ తలంచుతారు. అందువలన మనసు నిస్తేజమై పుస్తకాలలో ఉన్నదాన్ని మించి మరేదో నేర్చుకోలేక పోతున్నది. తననెలా పరిశీలించుకోవాలో, తనచుట్టూ వున్న మనుష్యులను, వస్తువులను ప్రకృతిని ఎలా పరిశీలించాలో ఇతరులు చెప్పేదెలా వినాలో విద్యచూపవలసిన అవసరమేర్పడుతున్నది. ఇట్టి పరిశీలనను ఉపాధ్యాయులు చేయగల్గినపుడే దాని విలువను గ్రహింపగలరు. ఏవిధంగానూ బలవంతం చేయకుండా విద్యార్థులను గూడా అట్టి పరిశీలన చేసేందుకు ప్రోత్సహింపగలరు. కాని విద్యార్థులు ఏవో వ్యాపకాలలో సరదాలలో నిత్యం మునిగిపోయివుంటే ఇలాంటి పరిశీలన సాధ్యంగాదంటారు కృష్ణమూర్తి. మనసు ఏదో ఒక దానిలో నిమగ్నం గాకుండా ఖాళీగా ఉన్నపుడు తనలో జరుగుతున్న దానిని తనచుట్టూ జరుగుతున్న దానిని పరిశీలించే సమయముంటుంది. ఆ స్వేచ్ఛలోనే విద్యార్థి సున్నితంగా ఉంటాడు. పరీక్షించి నేర్చుకున్నప్పుడే ఆ సున్నితత్వానికి పరాకాష్ట 'ప్రజ్ఞ' అని అర్థమవుతుంది. స్వేచ్ఛలోనే అట్టి పరిశీలన సాధ్యమవుతుందని విద్యార్థికి చెప్పాలంటే ఉపాధ్యాయునికి గూడా ప్రజ్ఞ అవసరం.

మంచి విద్యార్థులెటువంటి పాత్ర నిర్వహిస్తారో కృష్ణమూర్తి చెప్తారు. తనలోనున్న దాన్ని తనచుట్టూ నున్న దాన్ని మొత్తంగా పరిశీలించేవాడు నిజమైన విద్యార్థి, పరిశీలించిన దానిని దేనితోనూ పోల్చడు. అవుననో కాదనో తేల్చివేయడు. కేవలం వైజ్ఞానిక విషయాలను పరిశీలించి నేర్చుకోవటమే గాక ప్రకృతిని, పక్షులను, చెట్లను, కొండలను, మనుష్యులను, వారి స్వభావాలను, వేషభాషలను గూడా పరిశీలిస్తూ ఎంతో నేర్చుకోగలడు. ఆ విధంగానే అంతకంటే క్లిష్టమైన తన ఆలోచనలను పరిశీలిస్తూ నిత్యజీవితంలో తన ప్రవర్తనను తన చికాకులను కూడా పరిశీలింపగలడు. పరిశీలించే వాటిని అడ్డుకోకుండా పోల్చకుండా, ఇదింతేనని నిశ్చితాభిప్రాయానికి రాక పరిశీలించినప్పుడు మాత్రమే ఎంతో నేర్చుకోగలడు. అదే విధంగా ప్రకృతిని విశ్వాన్ని గూడా అర్థం జేసుకోగలడు. ఇట్టి పరిశీలనలను బహుదా పాదిగించినప్పుడు తానొక విద్యార్థే కాక ఉపాధ్యాయుడు గూడా! అంటే నేర్చుకునే వాడేగాక నేర్పేవాడునయి ఎన్నో విషయాలను తెలుసుకోగలడు. సంపూర్ణమైన స్వచ్ఛమైన పరిశీలన సాంకేతిక రంగంలో గూడా తేటమనసుతో పనిజేయిస్తుంది. సత్సంబంధాలతో మనిషిని ఎంతో దూరం తీసుకెళ్తుంది. మనిషిని మనిషిని దగ్గర జేస్తుంది.

# వినడం (Listening)

వినడమంటే కేవలం చెవులప్పగించి వినడం కాదు. ఇంద్రియాలన్నింటి సంపూర్ణ వికాసంతో హృదయంతో అంత:కరణతో వినడమంటారు కృష్ణమూర్తి. అంతటి సున్నిత మనస్కుడైన మనిషి ఎంతో శ్రద్ధతో వాత్సల్యంతో ధ్యానంతో వింటాడు. ఇందులో మాటల గారడీతో పనిలేనటువంటి ఎంచుకునే దృష్టి లేనటువంటి అన్యోన్యత ఉంటుంది. సరిగా వినడం గూడా ధ్యానమే. ఒక వాత్సల్యంతో ఆలకించటం గూడా. ఎదుటి వాళ్ళు ఏమిచెప్తున్నారో అర్థం చేసుకోవాలన్న శ్రద్ధ వున్నపుడే అలా వినటమూ జరుగుతుంది.

సాధారణంగా మనిషి సరిగ్గా వినడు. బాహ్యమైన గోలగాని అంతరంగంలోని గోలగాని అతనికున్న పూర్వజ్ఞానం గానీ విషయాన్ని ఉన్నదున్నట్లు విననీయకుండా అడ్డుకుంటుంది. పక్షపాత వైఖరితో విన్నదానిని తలక్రిందులు జేస్తుంది, తనకు తోచినట్లు తర్జుమా జేస్తుంది. కాని అనుభవాల ప్రభావంతో చెదరని మనసు ఉన్నపుడే వినటమన్న కళ యోగ్యమైన దవుతుంది.

ఒక విషయంలో అమితమైన శ్రద్ధ ఉన్నపుడు అవధానత ఉంటుంది. తేలికగా శ్రమలేకుండా ఏమి కోరుకోకుండా ఒప్పుకోకుండా వినటం సాధ్యపడేది మెదడు నిశ్చలంగా మనస్సు నిశ్శబ్దంగా నున్నపుడే ! అప్పుడే సంపూర్ణంగా గ్రహించగల్గుతుంది. 'ఆ వినడంలో లోతైన అంతర్దృష్టి ఉంటుంది కనుక అద్భుతమైన మార్పుజరుగుతుంది' అంటారు కృష్ణమూర్తి.

వినటమన్నది సంపూర్ణమైన చర్య. నిర్ద్వంద్వంగా వినటమే స్వేచ్ఛను దెస్తుంది. వింటున్న మనిషిలో వైరుధ్యాలు సంఘర్షణలూ ఆలోచనలూ ఉండవు. ముందుగా మనిషికి తన అంతర్గత బాహ్య విషయాల ఆటంకమున్నపుడు మనసు నిశ్శబ్దంగా ఉండదు. వింటున్న దాని గురించి చెప్పేదానిగురించీ ఏ ఊహాప్రతిమా ఆ నిశ్శబ్దాన్ని భంగం జేయనప్పుడు వినేవాడు చెప్పేవాడు అన్న ద్వంద్వ ముండదు. ముఖ్యమైనదేదో అప్పుడే ఆ క్షణమే ఆసాంతమూ గ్రహించి సరిగ్గా స్పందించగలడు. మార్పుగూడా అకస్మాత్తుగా వస్తుంది.

మనుషులమధ్య సంబంధబాంధవ్యాలను అధ్యయనం జేసే సామాజిక శాస్త్రజ్ఞుని కయినా, విషయజ్ఞానాన్నందించే విద్యావేత్తకయినా మంచి సంబంధాలేర్పరచు కోవటానికి ఇంత కళాత్మకంగా వినటమెంతో అవసరం.

# అభ్యసన (Learning)

మనిషి పుట్టినప్పటి నుండీ చనిపోయేవరకూ జీవితమంతా నేర్చుకుంటాడు. అభ్యసించటమంటే పరిశుద్ధంగా పరిశీలించటం. స్వేచ్ఛగా చూడటం వినటం జరిగినప్పుడు దానినే నేర్చుకోవట మంటారు కృష్ణమూర్తి. కాని తాను చూచిన దానిని విన్నదానిని తనకుతోచినట్లు మార్చే అభ్యాసపుడిక్కడ ఉండడు. అభ్యాసకునికి నిజమైన అభ్యసనలో చోటులేదు. అభ్యసించటమంటే ఎంతో సున్నితంగా, సునిశితంగా, అవధానతతో ఉండటం. ఆ సున్నితత్వంలో రోజంతా అన్నింటి నుండీ నేర్చుకోగలడు. అలానేర్చుకునే వానికి అణుకువ, ఒక చిగురుటాకు కుండే సున్నితత్వమే గాక విశేషమైన అమితమైన శక్తి గూడా ఉంటుంది.

అభ్యసించటమే శిక్షణ పొందటమంటారు కృష్ణమూర్తి. 'శిక్షణ' అన్న పదానికి మూలమైన ఆంగ్లపదం - డిసిప్లిన్ (discipline) . దాని యొక్క అర్థం అభ్యసించటం. అభ్యసన జరిగినప్పుడు అదే సుశిక్షితుని జేస్తుంది. బాధ్యతాయుతంగా పనిజేయిస్తుంది. శిక్షణంటే నేర్పవలసిన దానిని బలవంతంగా రుద్దటంగాదు. శిక్షణ అనుకరణకు గాని కట్టుబాటుకు గాని, అధికారానికి గాని దారితీయదు. పరిశోధనను అణచదు. పరిశోధించే మనసు మాత్రమే అభ్యసింపగలదు. పరిశోధిస్తూ నేర్చుకోవటమే మేలైన శిక్షణ అంటారు కృష్ణమూర్తి.

కుతూహలం, ఆసక్తి, శక్తి నేర్చుకోవటానికి తోడ్పాటునందిస్తాయి. సాధారణంగా మనిషి జ్ఞానాన్నార్జించి పదిలపరుచుకుంటాడు. పదిలంజేసుకున్న జ్ఞానమే ప్రధానమయినప్పుడు నేర్చుకోవటం ఆగిపోతుంది. అర్జించినజ్ఞానం కల్పించిన భద్రతలో మనస్సు అహంకార పూరితమవుతుంది. అంతేగాక ఆ గతించిన అనుభవాల జ్ఞానంతోనే వర్తమానంలో ఎదురవుతున్న వాటికి స్పందించాలని, సమాధాన మీయాలని చూస్తాడు.

ఆ నేర్చుకోవడం రెండు విధాలు. ఉద్యోగం సంపాదించటానికి కావలసిన నైపుణ్యాన్ని నేర్చుకోవటమొకటి. ఈ శిక్షణ భౌతికమైన జీవితావసరాలను తీర్చవచ్చు. రెండవది తనగురించి తాను నేర్చుకోవటం. మనుషుల మధ్య సంబంధాలను పాడుచేస్తున్న వాటిని, మనిషిని నిబద్ధునిగా జేసే పక్షపాత దృష్టిని, ప్రత్యేక సిద్ధాంతాలను, విపరీతమైన నడవడిని, నమ్మకాలను దృఢతరం జడతరం చేస్తున్న వేవో తెల్పుతుంది యీ రెండవ రకం అభ్యసన. అందుకు మనిషి తన జీవిత పుస్తకాన్ని పఠించవలసిందే నంటారు

కృష్ణమూర్తి. పైగా తన గురించి తాను నేర్చుకుంటున్నప్పుడు అది బాహ్యామైన విషయాలను సంపూర్ణంగా అర్థం జేసుకోవడానికి, సంపూర్ణంగా వాటినుపయోగించటానికి దోహదం జేస్తుందంటారు. స్వవిషయాలను సవివరంగా పఠించటంలో ఆలోచనలను, ఒక ఆలోచన మరొకదాన్ని వెంటాడటాన్ని ఆలోచనల్లో త్వరత్వరగా వచ్చే మార్పులను గ్రహించవచ్చు. బుద్ధికున్న ప్రవృత్తిని, దాని అధిక్యతను, అదిచేసే పనులను దాని పక్షపాత వైఖరిని గుర్తించదు. ఆశయాల మూలంగా, సంఘర్షణల మూలంగా తనలో ఏమి జరుగుతున్నదీ తెలుసుకోవచ్చు.

తన గురించి తాను అభ్యసించటాన్ని అశ్రద్ధజేయడం వలన ప్రపంచంలో ఇంతటి గందరగోళం నెలకొన్న దంటారు కృష్ణమూర్తి. అందుకే ప్రతిరోజూ తనకు తానుగా గాని ఇతరులతో గాని కూర్చుని అంత:పరిశీలన జేసి తమస్వరూపాలను పఠించమంటారు. స్వీయ పఠనం సున్నితమైన భావాన్ని, గొప్పమనోబలాలను పెంపొందించుతుంది. భూత భవిష్యత్కాల సంబంధాల నుండి స్వేచ్ఛనొంది వర్తమాన క్షణంలో ఉండే మనసుకు సున్నితమైన తత్త్వమలవడుతుంది.

కృష్ణమూర్తి దృష్టిలో ధ్యానంకంటె కార్యసాధన కంటె నేర్చుకోవటం ఎంతో ముఖ్యమైనది. సంపూర్ణ మానసిక స్వేచ్ఛలో, ఇతరులతో నున్న సంబంధాలలో జీవితపు ప్రతిక్షణాన్ని తానెలా జీవిస్తున్నది తెలుసుకోమంటారు. ఒంటరిగా తనకుతానుగా పఠించటమే ప్రజ్ఞాపూర్వకమైన అభ్యసనయని అట్టి అభ్యసన మనసును తేటతెల్ల పరుస్తుందనీ అంటారు. ఎలా అభ్యసించాలో సూచిస్తూ పాఠశాలలకు ఉత్తరాలు వ్రాశారు. " అభ్యసించటానికి తగినంత సమయమీయాలి. విషయంతో ఆడాలి, ప్రశ్నించాలి. జీర్ణించుకోవాలి అప్పుడే అది వ్రాసిన వానిది గాక మీదవుతుంది అంటారు.

ఉపాధ్యాయునికి విద్యార్థులకు మధ్యనున్న అన్యోన్య సంబంధాలలో నేర్చుకోవటముంటుంది. వారిరువురికీ ఉన్న సాన్నిహిత్యంలో కేవలం మాటలకే పరిమితం గాని వివేకస్థాయిలో ఒక భావనను పంచుకొని గాఢంగా సూక్ష్మంగా అనుభవించటమే నేర్చుకోవటం. అభ్యసనలో బోధించేవాడు, నేర్చుకొనేవాడు అన్న భేదంతోచదు. నిజమైన అభ్యాసకుడు జీవితంలో తటస్థించిన బాహ్యాఅంతరంగ విషయాల న్నింటినీ పరిశీలిస్తాడు. ఒకదానిని మరొకదానితో పోల్చియిది తగింది యిది కాదు అంటూ బేరీజు వేయడు - అంటారు కృష్ణమూర్తి. ఈ పోల్చటము పోటీల పైన, పూర్వానుభవాలపైన ఆధారపడి నేర్చుకోవటమే భయాన్ని నిబద్ధతను పెంచుతుంది.

అయినా పాఠశాలలు, విశ్వవిద్యాలయాలు అలాంటి విద్యకే ప్రాముఖ్యతనిచ్చి పోటీని పెంచుతున్నాయి. ఎక్కడ చూసినా మనిషి గెలుపు కోసం ప్రయత్నిస్తున్నాడు. గెలిచిన మనిషినే గౌరవిస్తున్నాడు. ఈ పోటీ ఆధునిక సమాజంలో ఒక సాధారణ ప్రక్రియ అయిపోయింది. ఎన్నో సమస్యలను పెంచుతున్నది. పోటీని దాని మూలంగా పెరిగే సంఘర్షణను పరిశీలించి వాటినుండి స్వేచ్ఛనొంది నప్పుడు మాత్రమే యదార్థత గోచరిస్తుంది. స్వీయ జీవిత గ్రంథ పఠనంలో ద్వైతభావం లేనప్పుడు నిజమైన ఆత్మపరిశీలన జరుగుతుంది. అక్కడ సత్యాన్వేషణ ఆరంభమవుతుంది.

నిజమైన విద్యార్థి శాస్త్ర విషయాలను మాత్రమే పరిశోధింపక అంతకంటే క్లిష్టమైన మనసు ఎలాపనిచేస్తున్నదో పరిశీలిస్తాడు. ఆపైన అనుభవజ్ఞులైన పెద్దలకంటె పిల్లలకే నిబద్ధత తక్కువ గనుక యీ క్లిష్టమైన ఆత్మపరిశీలన పిల్లలే తేలికగా జేయగలరు.

నేర్చుకోవట మంటే బుద్ధితో గ్రహించటము. గ్రహించినదానిని మాటల రూపంలో వెల్లడించటం మాత్రమే గాక దానిని పంచి యివ్వడం గూడా ఒకరి పట్ల మరొకరికున్న గాఢవాత్సల్యంలోనే యిట్టి అవగాహన పంచుకోవటం సాధ్యమవుతుంది. అంతేగాని ఉపాధ్యాయునిపై ఆధారపడినప్పుడు, అతడి ననుసరించినప్పుడు అది సాధ్యమవదు. అంటే విద్యార్థులను ఒప్పిస్తూనో, తాను ఒప్పుకుంటూనో, గర్విస్తూనో, వెన్నాడుతూనో, ప్రభావితులను జేస్తూనో ఉపాధ్యాయుడు బోధింపడు. ఒకరిపట్ల మరొకరికి గల అభిమానం, ఆలోచనాత్మకమైన శ్రద్ధ ఉన్న వాతావరణం అభ్యసించటానికి దోహదం జేస్తాయి. అవాతావరణంలో నేర్చుకోవటమంటే అవగాహన పట్ల ఆచరణపట్లా గలప్రేమే.

ఉపాధ్యాయుడు యదార్థాన్ని చూపుతూ, బోధిస్తే ఆ స్పష్టత విద్యార్థుల్లో సున్నితత్వాన్ని, సహజత్వాన్ని నిలుపుతుందని కృష్ణమూర్తి ఒక నూతన ప్రక్రియ నందించారు. వీరి దృష్టిలో బోధనంటే కేవలం కొన్ని విషయాలు తెలియజేయటం కాదు. కొన్ని తరాల మానవులను సృష్టించటం. బోధన ఒక పద్ధతిగాదు. ఒక జీవితవిధానం. వీరి దృష్టిలో ప్రపంచంలో ఉన్నతమైనది మరొకరికి బోధించటమే. ఉత్సాహంతో, అమాయకమైన, అభిరుచులతో ఉండే విద్యార్థులు అడిగేవి గాని చెప్పేవి గాని సున్నితంగా వినే ఉపాధ్యాయుడు మాత్రమే వారిని అర్థం చేసుకోగలడు. అప్పుడే విద్యార్థి గూడా చెప్పేదాన్ని శ్రద్ధగా వినగలడు. అటువంటి శ్రద్ధ ఉన్నపుడే నేర్చుకోవడానికి మార్గాలన్నీ తెరువబడుతాయి.

విద్యావేత్తలు కృత్రిమమైన ప్రయత్నాలతో విద్యార్థుల్లో స్థైర్యాన్ని నమ్మకాన్ని కలిగింపలేరు. తల్లితండ్రుల వాత్సల్యం, ఉపాధ్యాయుల అధిపత్యం కూడా పిల్లలను పుస్తకాలకే పరిమితం చేస్తుంటాయి. కాని పిల్లల ఇష్టాఇష్టాలకు, వారి ప్రశ్నలకు స్పందించినపుడే వారికి వారిపైన నమ్మకం ఏర్పడి ఆత్మస్థైర్యం గలుగుతుంది. తమ శక్తి సామర్ధ్యాలను కనుగొని వాటిని పెంపొందించుకోవటానికి విద్యార్థులతో పెద్దలు సహకరించాలి. పెరిగే వయసులో వారికి వివిధ విషయాలపైన గాఢమైన అనురక్తి కలుగుతుంది. ఒక్కొక్కదశలో వారికి కలిగే విభిన్న యిష్టాల్లో తగినవాటిని వారే ఎంచుకోగలరు. విద్యార్థులపైన పెద్దల ప్రభావం అధికమైనప్పుడు వారి శక్తులన్నీ ఉపయోగపడకపోవచ్చు. వారి శక్తుల వ్యక్తీకరణకు పూర్తి అవకాశమున్నపుడు వారిలో సంపూర్ణ వికాసం జరుగుతుంది. అప్పుడే సర్వసమానమైన సమాజాన్ని సృష్టించవచ్చు.

## అంతర్దృష్టి (Insight)

గతానుభవాలు జ్ఞానరూపంలో అంటే ఆలోచనల రూపంలో మనసును ఆక్రమించనప్పుడు ఆ స్వేచ్ఛలో, అద్వితీయ స్థితిలో ఎంతో శక్తి వెలువడి ఒక్కసారిగా అంతర్దృష్టి కలుగుతుంది. అంతర్దృష్టి ఏ సమస్యనైనా ఖచ్చితంగా పూర్తిగా యధాతథంగా గ్రహిస్తుంది. అంతర్దృష్టి కలగాలంటే ఆలోచన నుండి, ఆలోచన సృష్టించే కోరిక నుండి, విచారం నుండి, ఒంటరి తనాన్నుండి స్వేచ్ఛనొందటం ముఖ్యం. అంతర్దృష్టి సంపూర్ణమైంది. ఇది యాంత్రికంగా అవిరామంగా సాగదు. దీన్ని ఆలోచనతో సాధింపలేము. ఇది పూర్వానుభవ ప్రేరణతో రాదు. సంపూర్ణధ్యానంతో నున్నప్పుడు ఎట్టి వత్తిడీ లేనప్పుడు అంతర్దృష్టి ఒక మెరుపులాగా అకస్మాత్తుగా కలుగుతుంది.

అంతర్దృష్టికి కాలంతో జ్ఞాపకంతో సంబంధం లేదు. ఇందులో 'నేను' అన్న భావన ఉండదు. ఇది తన జ్ఞానార్జనకు జ్ఞాపకాల ప్రోగుకు పరిమితమై ఉండదు. కాని జ్ఞాపకాలపైన ఆలోచనలపైన యీ అంతర్దృష్టి ప్రభావం ఉంటుంది. అంతర్దృష్టి హేతువు కందదు. అంతర్దృష్టి కలిగిన పిమ్మట అది ఆలోచనను పయోగించుకుని హేతుబద్ధమైన చర్యగా పొడిగింప బడవచ్చు నంటారు కృష్ణమూర్తి.

అంతర్దృష్టి కలిగినప్పుడు కాలంలో భాగమైన మెదడు కణాలు విచ్ఛేదమవుతా యంటారు. మెదడు కణాలలో అంతర్దృష్టి తెచ్చే యీ మార్పును నిరూపింపలేము. కాని నిబద్ధమైన మెదడు అంతర్దృష్టి వలన నిబద్ధతను పోగొట్టుకుంటుంది. ఉదాహరణకు

చిన్న నాటినుండి సంతరించుకున్న మానసిక గాయాలను తీక్షణంగా గమనించినప్పుడు అంతర్దృష్టి గలిగి మనోబాధ పూర్తిగా అంతమయిపోతుంది. అంటే మనోబాధ గురించి దాని ప్రతి చర్యల గురించి విశ్లేషించకుండా బాధిస్తున్న ఊహారూపాలపై ఒక్కమారుగా మనిషి సంపూర్ణ దృష్టి సారించగల్గితే అవి పూర్తిగా కరిగిపోతాయి. అంతర్దృష్టంటే ఎటువంటి స్వార్థ చింతనాలేని గొప్ప సున్నితత్వం. 'నేను' నాకు అన్నవి లేనిది. దీనికి కారణముండదు. కాని కారణంలేని అంతర్దృష్టి ప్రభావం కారణభూతమైన వాటిపైన ఉంటుంది.

## మానసిక మరణం (Psychological death)

గతానుభవాల నుండి సంపూర్ణస్వేచ్ఛను పొందటమే మానసిక మరణం. భౌతిక శరీరానికి మృత్యువు ఒక్కమారే వస్తుంది. కాని గతించిన అనుభవాల భారాన్ని మోయకుండా ప్రతి నిముషమూ మానసికంగా మరణించి నప్పుడే సంపూర్ణ అవగాహన గల్గుతుంది. ప్రతి క్షణంలోనూ నూతనంగా జీవించటం సాధ్యమవుతుంది. మనకు జీవితమెంత దగ్గరో మరణమూ అంతే దగ్గర. జరుగుతున్న ప్రతిదాని చివర మానసిక మరణముండాలి. మానసిక మరణమంటే నిశ్శబ్దతే. అంటే నేను కేంద్రమైన జీవితాన్ని గడుపుతూ మెదడు కూర్చిపెట్టినవన్నీ యీ మరణంతో తుడిచిపెట్టబడతాయి. అప్పుడు ప్రతిరోజూ ప్రతిక్షణమూ మానసిక భారాన్నుండి పొందిన స్వేచ్ఛతో ఆ మరణంలో మనసు వర్తమాన క్షణాలలో స్వచ్ఛంగా ఉండగలదు.

మానసిక మరణమంటే ఈర్ష్యపడుతున్న మనసు ఈర్ష్యపడగూడదను కోవటం గాదు. అందుకు వ్యతిరేకమయిన లక్షణాలను పెంపొందించు కోవాలను కోవటమూ గాదు. ఈర్ష్యను నిర్ద్వంద్వంగా సంపూర్ణంగా గ్రహించి ఎట్టి ప్రయత్నమూ జేయకుండా సహజ సిద్ధంగా అంతమవనీయటమే. అప్పుడే మనసు ప్రేమమయ మవుతుంది.

అంతం లేకుండా పునఃప్రారంభం లేదు, చావులేక పుట్టుకే లేదు. జరిగిపోయింది అంటే అయిపోయింది మరణించినట్లే. కాని మనసు జరిగిపోయిన దాన్ని పట్టుకుని ఊగులాడుతుంది. భూతకాలపు అనుభవాలను అంతమవనీయక భవిష్యత్తులోనికి చొప్పిస్తుంది. ఎంతోమానసిక ప్రపంచాన్నేర్పరుస్తుంది. సాధారణంగా 'నేను' కేంద్రంగా ఏర్పరచుకున్న మానసిక ప్రపంచం అంతమవట మన్న ఆలోచనే నిబద్ధుడైన మనిషిని భయభ్రాంతుని జేస్తుంది. తాను లేకుండా పోతానేమోనన్న భయాన్ని కల్గిస్తుంది.

అందుకే 'నేను' అన్నది అంతమవకుండా కాపాడు కోవటానికి మనిషి పునర్జన్మ వంటి పెక్కు సిద్ధాంతాల నేర్పరుస్తాడు. భవిష్యత్తుపైన ఆశతో నమ్మకంతో తన వర్తమాన జీవితాన్నే అశ్రద్ధ జేస్తాడు.

మరణమంటే ఏమిటో తెలిస్తే దాని గురించి భయముండదంటారు కృష్ణమూర్తి. భూతకాల ప్రభావంలేని, భవిష్యదాశయం లేని మానసిక స్వేచ్ఛమాత్రమే అంటే మానసిక మరణం మాత్రమే సంపూర్ణ జీవితాన్ని సుసాధ్యం జేస్తుంది.

## ధ్యానము (Meditation)

ధ్యానమంటే కేవలము శరీరాన్ని ఆలోచనను నియంత్రించటము గాదు. గాలి పీల్చి వదిలే ప్రక్రియగాదది. ధ్యానాన్ని ప్రారంభించవలసింది శరీరంతో గాదు మనసుతో. మనసుకున్న వివిధ రూపాలను చూడాలి. పక్షపాత బుద్ధితో స్వార్థంతో కుతూహలంతో మనసెలా అభిప్రాయాలనేర్పరచు కుంటున్నదో, నమ్మక అపనమ్మకాల్లో ఆనందాన్నే విధంగా కోరుకుంటున్నదో ఆలోచనలను ఎలా నిబద్ధించి అణచివేస్తున్నదో, సంఘర్షణకు, హింసకు, అపక్రమానికి, దుఃఖానికి ఎలా బాధ్యురాలో అర్థం జేసుకోవాలి. వీటన్నింటినీ ధ్యానంతో గ్రహించినప్పుడు మెదడు నిశ్చలంగా ఉంటుంది. మానసిక నిశ్శబ్దతలో ఆలోచన అంతమవుతుంది. అంటే నిబద్ధతతో పదే పదే ఊహా ప్రతిమల నేర్పరచే తపసి లేకుండా యీ తపం జరుగుతుంది. ఈ ధ్యానం బుద్ధికి సంబంధించింది గాదు.

హృదయం మనసులోనికి ప్రవేశించినప్పుడు ఉన్న మనసు యొక్క విలువ వేరుగానుండి చురుగ్గా పనిచేయటమే గాక యీ విశాల విశ్వంలో అవధుల్లేకుండా జీవించగల్గుతుంది. జీవితంలో ధ్యానమనేది ఒక కళ. దానిని ఎవరి నుండి నేర్చు కోలేడు. దీనికెటువంటి నియమితమైన విధానమూ లేదు. ధ్యానమంటే ఎంపిక లేకుండా, బేరీజు వేయకుండా ఉన్నదున్నట్లు తన గురించి తాను తెలుసుకోవటమే. ధ్యానం బహు సులభ మంటారు కృష్ణమూర్తి. కానీ మనిషి దాన్ని క్లిష్టంజేస్తాడు. శరీరం నిశ్చలంగా ఆరోగ్యంగా ఏశ్రమా లేకుండా ఉన్నప్పుడు, సున్నితమైన భావనను సానబెట్టి కాపాడినప్పుడు మనసు తన ఆలోచనలను, చిరాకులను, వేర్పాటును అంత మొందించినప్పుడు ఆ మనసు ఆరోగ్యంగా చేతనను నింపుకుని అత్యుత్సాహంగా ఉంటుంది. ఉన్నతమైన భావనలతో ఎంతో సున్నితంగానూ ఉంటుంది. అంతేగాక మనసులో ఏ విషయమూ లేకుండా ఖాళీగా ఉన్నప్పుడు అంటే ఆలోచన లేనప్పుడు

శరీరానికి మనసుకు మంచి సంబంధమేర్పడి అమితమైన శక్తి గలిగి హృదయమంతా ప్రేమతో నిండి ధ్యానం జరుగు తుందంటారు.

ప్రేమ తత్వమే ధ్యానం. అంటే ఒకరినో కొందరినో ప్రేమించడం గాదు. ప్రేమ నీటివంటిది. ఆ నీటిని బంగారు పాత్రతోనూ త్రాగవచ్చు. మట్టిపాత్రతోనూ త్రాగవచ్చు. ఆ నీటినెవరు త్రాగినా ఎంత త్రాగినా అయిపోదు. ధ్యానమంటే సహృదయత వికసించటం. సహృదయతను పెంచటం గాదు. పెరిగేది ఏదైనా తరిగిపోతుంది. దాన్ని తిరిగి మొదలు పెట్టాలి. 'నేను' అన్న విభజన నుండి స్వేచ్ఛనొంది నప్పుడే మనిషి మంచివాడవుతాడు.

ధ్యానంలో నీవెక్కడున్నావో, ఎక్కడికి వెళ్తున్నావో, దానికంతమేదో తెలుసుకోవాలన్న ప్రయత్నం లేకపోవటమే దానికున్న సౌందర్యమంతా నంటారు కృష్ణమూర్తి. చేతనలో నైనా అంతశ్చేతనలో నైనా స్వార్థచింతన ఉంటే, ప్రేరణ ఉంటే అది ధ్యానం గాదు. చేతనా చేతనల్లోనున్న స్వార్థ ప్రేరణల నుండి మనసు సంపూర్ణ స్వేచ్ఛనొంది నిశ్శబ్దంగా నున్నప్పుడు, మెదడు నిశ్చల మయినప్పుడు సంపూర్ణశక్తితో నున్న క్షణాలే ధ్యానపు క్షణాలు. ఆ స్వేచ్ఛ ప్రతిక్షణమూ అనుభవింప దగింది. ధ్యానం మనిషి దిన చర్యలో ఒక భాగం. ఒక జీవిత పంథా! దానిలో జీవితపు నిండుదనాన్ని సౌందర్యాన్ని ప్రతిక్షణం అర్థం జేసుకోగలం. దైనిక జీవితంలో చుట్టూ మనుషులు వస్తువులు ఉన్నపుడు, బస్సులో కూర్చున్నపుడు కళ్ళుతెరచి చూస్తున్నప్పుడు కూడా ధ్యానం జరుగవచ్చు. జీవితానికి దూరమై చేసేది ధ్యానంగాదు. భావ గర్భితమైనదీ గాదు. సత్యమైన సవ్యమైన పునాది ధ్యానానికెంతో అవసరం. సత్యవర్తనం లేనిధ్యానం కేవలం పలాయనమేనని, భ్రమ మాత్రమేనని అంటారు కృష్ణమూర్తి.

ఆలోచన అంతమయినప్పుడు నిబద్ధమైన చేతనంతా ఖాళీ అవటంతో మనసు నిశ్శబ్దంగా మెదడు నిశ్చలంగా ఉండగలదంటారు కృష్ణమూర్తి. ఏవిధమైన మానసిక పోకడా లేనప్పుడు ఆలోచన అంతమయినప్పుడు ఆ నిశ్శబ్దతలో ఆ స్వేచ్ఛలో ప్రజ్ఞ మేల్కొంటుంది. సహృదయత చోటు చేసుకుంటుంది. హృదయ మంతా ప్రేమ మయమవుతుంది. ప్రజ్ఞాప్రేమలున్న ఆ శూన్యతలో మనిషి సృజింపగలడు. తన అంతర్దృష్టితో సత్యాన్ని సౌందర్యాన్ని చూడగలడు. శరీరానికి మనసుకు హృదయానికీ అప్పుడే సమన్వయ ముంటుంది.

## మానసిక స్వేచ్ఛ (Freedom)

స్వేచ్ఛంటే భూత భవిష్యత్కాలపు ఆలోచనల కదలికలు లేకుండా పూర్తిగా నిశ్శబ్దతలో నుండటం. మనిషి సాధారణంగా యీ స్వేచ్ఛను కాదని అధికృత నలవరచు కుంటాడు. తాను ప్రత్యేకంగా ఉండాలనుకునే మనిషికి స్వేచ్ఛలేదు. అనుభవజ్ఞుల ననుకరించాలనుకునే వారికీ స్వేచ్ఛలేదు. పైగా వినయాన్ని ప్రదర్శించటం, వారిపై ఆధారపడటం వారికి దగ్గరవటం కోసం ప్రయత్నిస్తూ వారిననుసరించటం మనసును నిస్సారంగా జేస్తాయి. అంతమాత్రాన వాటికి వ్యతిరేకంగా నడవటంలోనూ స్వేచ్ఛలేదు. ప్రయత్నించి సాధించటంలోనూ స్వేచ్ఛలేదు.

క్రమ శిక్షణ స్వేచ్ఛ పరస్పరానుబంధాలు. క్రమశిక్షణ (Discipline) అంటే నేర్చుకోవటము స్వేచ్ఛలోనే సాధ్యమవుతుందంటారు కృష్ణమూర్తి. తానార్జించిన జ్ఞానాన్నుండి స్వేచ్ఛను పొందినప్పుడే నేర్చుకోవటం సాధ్యమవుతుంది. మనిషికున్న లక్షణాలన్నీ సంపూర్ణ స్వేచ్ఛలోనే వికసిస్తాయంటారు. కానీ లెక్కలేనన్ని అనుభవాలతో తాను ఏర్పరచుకున్న అభిప్రాయాలకు, భావాలకు, ఆదర్శాలకు, తత్వానికి కట్టుబడి వుండే మనిషికి ఆ సంపూర్ణ స్వేచ్ఛ అసాధ్యమవుతుంది.

స్వేచ్ఛంటే ఎవరికి తోచినట్లు వాళ్ళుండటం గాదు. వికటించిన విచ్చలవిడి తనమూగాదు. స్వేచ్ఛ ఎంతో బాధ్యతాయుత మైంది. దీని నర్థం జేసుకోవటానికి మానసిక వికాసమవసరం. అంటే మనసు, శరీరం, హృదయం పూర్తిగా వికసించి ఎట్టి వ్యతిరేకత, పరస్పర విరుద్ధత లేకుండా అన్యోన్యంగా పనిచేయటం. మనిషికెట్టి వత్తిడీ లేనప్పుడు, నిస్వార్థమైన దృష్టి ఉన్నప్పుడు మానసిక వికాసం జరుగుతుంది. అలవాటు (మానసిక అలవాటు) అనే ప్రక్రియ నర్థం జేసుకున్నప్పుడు, పోల్చి చూసుకోవటాన్నే

నిషేధించినప్పుడు మనిషి కనిపెట్టిన దేవుడు, నమ్మకాలు అనే రక్షణ యంత్రాంగాలను పూర్తిగా ధ్వంసం జేసినప్పుడు, కేవలం పుస్తక జ్ఞానంపైన పూజారుల వంటి వారిపైన ఆధారపడ నప్పుడు ఈ స్వేచ్ఛ వుంటుంది.

స్వేచ్ఛను తాత్వికంగా నిర్దిష్టంగా నిర్వచింపలేము. స్వేచ్ఛంటే పూర్తి ఏకాంతం. ఎట్టిప్రేరణపైన జ్ఞానంపైన ఆధారపడని అంతర్గతస్థాయి. తనకు అనుభవం కావాలి జ్ఞానం పొందాలి. పూర్వానుభవాలు అధికారాన్నిస్తాయి గనుక మనిషి వాటిపై ఆధారపడతాడు. తర్వాత మనమేం జేస్తామన్నదానికంటే యిప్పుడు మనమేం జేస్తున్నామన్నది చాలా ముఖ్యం. ఆరంభం, వేసే మొదటి అడుగు. నడుస్తున్న మార్గం సరైనదైతే జీవితమంతా సుగమమే. స్వేచ్ఛతో వేసే మొదటి అడుగే చివరి అడుగు అవుతుంది. స్వేచ్ఛను ఏదో ఒకదానినుండి పొందటం గాదు. ఆరంభమూ అంతమూ గూడా స్వేచ్ఛేనంటారు కృష్ణమూర్తి. ఏదో ఒక్క విషయంలోనే ఒక స్థాయిలోనే స్వేచ్ఛగా ఉండటం గాదు. అన్నింటిలో ప్రతి స్థాయిలోనూ స్వేచ్ఛగా ఉండటం - అంటే ఆద్యంతాలలోనూ మధ్యనున్న జీవితంలో గూడా స్వేచ్ఛగా ఉండటం.

స్వేచ్ఛ దేనిపైనా ఆధారపడదు. స్వేచ్ఛ లేనప్పుడు స్వస్వరూప జ్ఞానం కలుగదు. స్వస్వరూప జ్ఞానం లేకుండా ధ్యానమూ లేదు. జ్ఞానాన్నుండి స్వేచ్ఛనొందిన మనిషి క్షణ క్షణం వాస్తవ వర్తమానాలలో జీవింప గలడు. స్వేచ్ఛలో మానసిక నిశ్శబ్దత ఉంటుంది. ఆ నిశ్శబ్దతలో సృజించటం సాధ్యమవుతుంది. ఆ నిశ్శబ్దతలో సర్వేంద్రియాలూ మెదడూ చక్కగా పనిచేస్తాయి గనుక ఎంతో శక్తి ఉంటుంది.

విషయ సామగ్రితో నిండిన చేతన గలవానికి నిశ్చలత్వం, నిర్మలత్వం, ఆనందం ఉండవు. ఆనందంగా ఉండే మనిషే నిజమైన ధార్మికుడు. అట్టి ధార్మికుని జీవితమే సాంఘిక సేవంటారు. మనిషికి కావలసింది కోరిక నుండి స్వేచ్ఛ నొందటమే. భౌతికమైన కోరిక నుండి గాదు. ఆకలేసినప్పుడు ఆహారమవసరం. మానసికం కావింప బడిన కోరిక నుండి స్వేచ్ఛ నొందాలి. అంటే ఈ కోరిక మూలంగా గల్గిన ఆందోళన నుండి బాధ నుండి స్వేచ్ఛ నొందటం. అంతేగాని ఏకోరికా లేకపోవటం గాదు. కోరిక లేకుండా ఏ మనిషీ జీవించలేడు.

మనిషి నంటిపెట్టుకుని ఎన్నో సూక్ష్మమైన సమస్యలూ ఉంటాయి. వాటిని ఎంపిక లేకుండా గ్రహించాలన్నా స్వేచ్ఛగావాలి. భూతకాలపు భారం భవిష్యత్తుపై ఆశేలేని మనసు ఏ కోరికల వలయంలోనూ చిక్కుకోకుండా అంతర్గతంగా, బహిర్గతంగా స్వేచ్ఛనొంది జీవితంలో నిత్యనూతనంగా మనగల్గుతుంది. నిత్య నూతనంగా ఉండే

మనసున్న మనిషి ఏమిచేసినా మానవాళి మంచికోసమే చేస్తాడు. సహృదయత వికసించేది స్వేచ్ఛలోనే

## సున్నితత్వం (Sensitivity)

సున్నితమనస్కుడు ప్రక్కవాని సంతోషంలో దుఃఖంలో పాలుపంచుకుంటాడు. జబ్బుతో కృశించి పోతున్న వానిని చూసినప్పుడు, బీదవాని భయభ్రాంతులకు, శ్రామికునికి, కొండలకు, కదలిపోతున్న మేఘాలకు, ప్రవహించే నదులకు, మైదానాలపై చెట్లకు, లోయలకు, ఉదయించే సూర్యునికి, మానవుని సుదీర్ఘ చరిత్రకు, ప్రతి జీవి మరణానికి - ఒక్కటేమిటి? అనుభవాలన్నింటికీ స్పందిస్తాడు. తన భయాల్లో బాధల్లో ఆశల్లో ప్రతి చర్యల్లో చిక్కుకుపోక స్వేచ్ఛగా నున్న మనిషి మాత్రమే అలా స్పందిస్తాడు.

ప్రత్యక్ష జ్ఞానం ఉన్నప్పుడు మనిషి సున్నితంగా ఉంటాడు. సున్నితత్వంలో ఎంపిక లేదు. విమర్శలేదు. న్యాయవిచారణ లేదు అంటారు కృష్ణమూర్తి. ఎంపిక మనిషిని స్వార్థపూరితునిగా జేస్తుంది. సంఘర్షణను సృష్టిస్తుంది. ఆ సంఘర్షణ నుండి బయట పడేందుకు శక్తినీ కోరుతుంది. కాని ఆశక్తి పరిమితం. తాను బేరీజు వేసి ఎంపికజేసి యిచ్చే తీర్పుతో మనిషి గర్విస్తాడు. ఈ ఎన్నుకునే కార్యక్రమమే మనిషి సున్నితత్వాన్ని నాశనం జేస్తుంగి. సున్నితత్వంలో పనికిరాక మిగిలేదేమీ ఉండదు. ఒకదానిని ఎన్నుకునేటప్పుడు రెండవది జ్ఞాపకంగా చేతనలో భాగంగా మిగిలి పోతుంది. ఆలోచన నుండి ఎంపిక నుండి స్వేచ్ఛనొందిన మనిషే చుట్టూఉన్న మనుషులతో సున్నితంగా మసలగ౦డు. సున్నితత్వమంటే జరుగుతున్న దానికే గాక అనంతమైన దానికూ్కడా స్పందించటం.

## ప్రజ్ఞ (Intelligence)

మనిషికున్న శక్తి యోగ్యతల గురించి కృష్ణమూర్తి కనుగొన్నవి మానసిక శాస్త్రానికెంతో విలువైనవి. 'బుద్ధి' అంటే కనుగొనే శక్తి. సహేతుకంగా ఊహించగల శక్తి. భావోద్వేగాలు లేని ఆలోచన. అంటే 'బుద్ధి' కేవలం మనిషి ఆలోచించే శక్తి యంతటికీ సంబంధించింది. 'బుద్ధి'తో వివరంగా ఆలోచించినా ఆలోచించేది మాత్రం 'నేను' అన్న కేంద్రం నుండే. ఆలోచనకు అన్ని సమయాల్లోనూ పరిధులుంటాయి. ఆంతరంగిక బాహ్యావ్యాపకాలను బుద్ధి ప్రభావితం జేసినప్పుడు ఆధిక్యత వహించినప్పుడు మనిషి చేసే పనులు అసంపూర్తిగా ఉంటాయి. ఉద్వేగ రహితంగా స్వార్థంతో ఆలోచించగల బుద్ధి

జీవితంలో కల్లోలాన్ని సృష్టిస్తుంది. మనిషిని గ్రుడ్డి వాడిని జేస్తుంది. నిరుత్సాహ పరుస్తుంది. తత్ఫలితంగా చింత ఆందోళన బాధ హెచ్చవుతాయి. ఎప్పుడూ బుద్ధి అంటే ఆలోచన పోల్చుతూ, పరిగణిస్తూ, పోటీబడ్తూ, అనుకరిస్తూంటుంది. స్వార్థపరుడు తెలివితేటలను శక్తిని తనకోసం ఉపయోగిస్తాడు. ఈ తెలివిగా బ్రతకట మన్నది సంఘర్షణను సృష్టించి అసమగ్రతకు దారితీస్తుంది. దయ ఆప్యాయతలనే అపురూపమైన భావాలకు మనసులో చోటు లేదు. మనిషి పూజిస్తున్నది యీ అసమగ్రమైన బుద్ధినేనంటారు కృష్ణమూర్తి.

నిబద్ధితమైన మనసు గురించీ ఆలోచన అల్లిన ఊహారూపాల గురించీ పరిశోధిస్తూ ప్రజ్ఞ కానిదేదో తెలుసుకుంటూ ప్రతి భూతకాలపు క్షణాన్ని అంతంజేస్తూ క్షుణ్ణంగా పరిశీలించిన వీరు మానవ ప్రజ్ఞలో మరో క్రొత్తలోతైన ప్రమాణాన్ని చూడగలిగారు. వీరి దృష్టిలో బాహ్య అంతర్గతాలనే తేడా లేదు. సత్యమన్నది ఏ తరగతి లోనికీ చేరదు. ఏ పేరూ పెట్టబడదు. అదికేవలం సత్యం.

మనిషికున్న శక్తిలో బుద్ధి ఒక్కభాగం మాత్రమే. ఆ భాగాన్నిదాని అంతస్తుకు మించి గౌరవించినప్పుడు జీవితం పట్ల పాక్షికమైన అసంబద్ధమైన దృష్టి మాత్రమే ఏర్పడు తుంది. ఆ అసంబద్ధత ఎన్నో సమస్యలకు కారణమవుతుంది. మనిషిలో ఏది పాక్షికంగా వికసించినా అది మనసుకు సమాజానికి సమస్యలను తెచ్చిపెడుతుందంటారు కృష్ణమూర్తి. ఆ సమస్యలను తప్పించుకునే ప్రయత్నాల్లో మనిషి భద్రతలేక తానంటే తనకు గల తక్కువ భావనతో బాధపడ్తూ రకరకాల హింసకు, మానవ వినాశనానికి కారణ భూతమవుతున్నాడు. మోసకారిగా మారుతున్నాడు.

పరిశోధనలు చేసి సిద్ధాంతాలను ప్రతిపాదించి బుద్ధిని మాత్రం పెంచటానికి ప్రయత్నించే విద్యావేత్తలు బుద్ధికి పెద్దపీటవేసి విజ్ఞానా న్నార్జించటానికి, పట్టభద్రుల వటానికీ సహాయపడుతున్నారు గాని వారి జీవితంలో యితరులతో సంబంధ బాంధవ్యాలేర్పరచు కోవటంలో ఎంత అసమర్థులవుతున్నదీ పరిగణించటం లేదు. ఆలోచన కానిది ఆలోచనలల్లిన ఊహా ప్రతిమల కాధారంగా నున్న బుద్ధిద్వారా అందుకోలేనిదీ అయిన ప్రజ్ఞామండలంలోనికి మనల నాహ్వానిస్తారు కృష్ణమూర్తి.

మానవ స్వరూపాన్ని సంబంధాలను అందలి నిబద్ధతను గ్రహించడం వల్ల ఆ నిబద్ధతే అంతమయినప్పుడు అంటే స్వార్థపు పోకడలన్నీ ఆగిపోయినప్పుడు యీ ప్రజ్ఞ మేల్కొంటుంది. వర్తమానంలో వాస్తవాన్ని ఏవిధమైన ఎంపికా చేయకుండా గ్రహించినప్పుడు ప్రజ్ఞ ఉదయిస్తుంది. ప్రజ్ఞ జీవితాన్నంతటినీ నడిపిస్తుంది.

ప్రజ్ఞావంతుడు ఎట్టి వివరణలతోనూ, నిర్ణయాలతోనూ, ముగింపులతోనూ సంతృప్తిపడడు. దేన్నీ గుడ్డిగా నమ్మడు. తానే పరిశోధిస్తాడు. వాస్తవాలను గమనిస్తాడు, అభ్యసిస్తాడు. ప్రజ్ఞ కేవలం జ్ఞానం గాదు. ప్రపంచంలోనున్న పుస్తకాలన్నింటినీ చదివినా అది ప్రజ్ఞనీయలేదు. తనను తాను నిర్ద్వంద్వంగా పరిశీలించి అర్థం జేసుకున్నప్పుడు ప్రజ్ఞ అప్రయత్నంగా సాధ్యమవుతుంది. ఏ భయమూ లేనప్పుడు జరిగే స్పష్టమైన అభ్యసన లాగా ఒక విప్లవంలాగా వస్తుందీ ప్రజ్ఞ. దురభిమానం లేని పరిశోధన నుండీ, స్వస్వరూప జ్ఞానాన్నుండీ వస్తుంది. ప్రయత్నంతో మాత్రం ప్రజ్ఞను సాధింపలేము.

ప్రజ్ఞ హేతువు నుండి జనించింది గాదు. కేవలం జ్ఞానాన్ని జ్ఞాపకాలను విషయాలనూ అందింపగల శక్తిగాదు. ఒక వస్తువును తయారు జేయగలగటమూ ప్రజ్ఞగాదు. జ్ఞానం ఉపయోగపడి వెలుగునిస్తుందిగానీ అది ప్రజ్ఞగాదు. ప్రజ్ఞ వీటన్నింటి కంటే ఎక్కువైంది. జ్ఞానాన్ని ఆలోచనను స్పష్టమైన వ్యక్తీకరణకు ప్రజ్ఞ ఉపయోగించుకుంటుంది. ప్రజ్ఞలేనప్పుడు ఆలోచనకు హద్దులు తెలియవు. యదార్థాన్ని గ్రహించటం వలన వచ్చే ఆలోచనే ఆరోగ్యకరమైంది. పవిత్రమైంది. ఆలోచన జ్ఞానంతో వ్యవహరిస్తుంది. ప్రజ్ఞ నిశ్శబ్దతతో, శూన్యతతో మాత్రమే వ్యవహరింపగలదు. అంటే ఆలోచన కదలిక లేనప్పుడు, వాటికి కేంద్రమైన 'నేను' ఉండదు గనుక మనసులో ఖాళీ ఏర్పడి యదార్థతను అవధానం జేస్తుంది. యదార్థతను చూసే మనసు తీరు పూర్తిగా నిశ్శబ్దంగా ఉంటుంది. అట్టి మనసు యదార్థాన్ని మార్చటానికి గాని అధిగమించి పోవటానికి గాని ప్రయత్నించదు. అసత్యంలోనున్న సత్యాన్ని సత్యంలాగా తోచేదానిలోని అసత్యాన్ని ప్రజ్ఞ చూస్తుంది. ప్రజ్ఞా పూర్వకమైన మనసు యదార్థ జ్ఞానాన్ని ఆలోచనను సవ్యంగా ఉపయోగించుకుంటుంది. ప్రజ్ఞతో చేసే పనిని సౌందర్యం ఆవరిస్తుంది. ప్రజ్ఞగల మనసు ప్రేమతో నిండి యుంటుంది. తెలిసిన దాని నుండి తెలియని దానివైపు మరల్చుతుంది.

మనిషెంత చదివిన వాడైనా, వాదింపగలవాడైనా, విశేషానుభవం గల వాడైనా, ప్రపంచమంతా చుట్టివచ్చినా, విషయబోధన చేస్తున్నా, అపార జ్ఞానాన్ని సంపాదించినా - వీటన్నిటి వలనా అతని ప్రజ్ఞకు చేకూరేదేమీ ఉండదు. ప్రత్యక్ష జ్ఞానం, స్వస్వరూప జ్ఞానం, కరుణలే ప్రజ్ఞకు పూర్వరంగాలు. మనసు, హృదయం, శరీరం సమన్వయంతో నున్నప్పుడే ప్రజ్ఞ అనుభవానికొస్తుంది. ప్రజ్ఞ ఉన్నప్పుడు 'నేను' అనే కేంద్రముండదు. 'నేను' అన్నకేంద్రం లేనప్పుడే కరుణ ఉంటుంది. కరుణ ప్రజ్ఞ ద్వారా పనిజేస్తుంది గాని భద్రతను విడగొట్టే భావనల ద్వారా, నమ్మకాలతో ఆశయాలతో నున్న బుద్ధిద్వారా

పనిజేయదు. కరుణాపూరితమైన ప్రజ్ఞలో పూర్తి భద్రత ఉంటుంది. అవగాహన ఉండీ ఏమీ ఆశించనప్పుడు ఉండే కరుణే జీవులన్నింటి జీవితసారం. అదే సక్రమమూ, ధర్మమూ, దైవిక జీవితమూ నంటారు కృష్ణమూర్తి. అదే యీ ప్రపంచంలో నీతిగా వ్యవహరించేట్లు జేస్తుంది.

దానధర్మాలు చేయటం గానీ, సాంఘికమార్పులు చేయడం గానీ కరుణ గాదంటారు కృష్ణమూర్తి కరుణలో కల్పన గానటువంటి, కేవలం ఉద్వేగ పూరితమైన ఉత్సాహంగానటువంటి స్వేచ్ఛ ఉంటుంది. ఎంతటి గందరగోళంలో నయినా దౌర్భాగ్యంలో నయినా స్థిరంగా ఉండే బలమైన శిల వంటిది కరుణ. ఈ కరుణ లేనిదే ఏక్రొత్త సమాజమూ రాలేదు. కరుణ ప్రజ్ఞతో పనిజేస్తుంది గాని బుద్ధితో జేయదు. ప్రజ్ఞపూర్తి స్వరూపమే కరుణగాని కరుణ వివేచనా జనితం గాదు. అన్నిరకాలైన పనుల్లోనూ, అన్ని సంబంధాల్లోనూ కరుణ పనిజేస్తుంది. మనిషిలో యీ రకమైన మార్పంతా యదార్థమే గనుక తన్మూలమైన ప్రజ్ఞ గూడా యదార్థమే. ఊహాజనితమైన ఒక భావనగాదీ ప్రజ్ఞ.

సాంకేతిక భౌతిక జీవిత రంగాలలో వివేచన చేయటానికీ, ఊహించటానికి, పోల్చి బేరీజు వేయటానికీ బుద్ధి ఎంతో ఉపయోగకరమే. ఈ బుద్ధి మనిషిలో పోటీ స్వభావాన్ని, అసూయను, సంఘర్షణను పెంచి శతృత్వానికి మూలమవుతుంది గనుక వీటిని నివారించేందుకు పిల్లల్లో బుద్ధి వికాసాన్నే గాక ప్రజ్ఞావికాసాన్ని గూడా కలుగజేయాలి. వారిని నిబద్ధత నుండి విడుదల జేయాలి. ఏవిధమైన మానసిక అవరోధమూ లేనప్పుడు మనసు, శరీరం, హృదయం ఐక్యమవుతాయి. ఈ అంతర్గత ఐక్యత వారేర్పరచుకునే సంబంధాలకు గూడా ప్రాకుతుంది. అంతేగాక ప్రజ్ఞతోనున్న ఆ సున్నిత క్షణాలలో అంతర్దృష్టి సృజనతలు గూడా సంభవమే నంటారు కృష్ణమూర్తి.

ప్రజ్ఞలో నేను అన్న భావన, ఆలోచన, కాలం, ప్రయత్నం, ఎంపిక లేవు గనుక దీన్నొక నిపుణతలాగా పెంపొందించలేము. విద్యారంగంలో ప్రజ్ఞకు ఒక ప్రముఖ పాత్రవున్నా దీనిని ఎలా పెంచాలన్నదే మన సమస్య. పరిశీలించటం, వినటం, శోధించటం పిల్లల సహజ ప్రవృత్తి. అందుకు వీలు గల్గించినప్పుడే ప్రజ్ఞ వికసిస్తుంది. తల్లిదండ్రులు ఉపాధ్యాయులు, అనుభవాలన్నింటి నుండీ నేర్చుకుంటూ లోతైన మనసును పెంపొందిం చుకున్నప్పుడు పిల్లలకు ఎటువంటి విద్య సరైందో ఆకళింపు జేసుకోగలరు. తమ బిడ్డలను పూర్ణ మానవులుగా పెంచగలరు.

విద్య వికసింప నీయవలసింది ప్రజ్ఞను గాని బుద్ధిని గాదు. వివేచన ప్రేమల సమన్వయమైన ప్రజ్ఞ బుద్ధి కంటె గొప్పది. అటువంటి ప్రజ్ఞ ఎటువంటి సమన్య నుండీ తప్పించుకోక సవ్యంగా ఆలోచించే తత్వాన్ని ప్రోత్సహిస్తుంది. తననుతాను తెలుసుకుని 'నేను' 'నా' అన్నదాని నధిగమించి ఉన్నత మవటంలో ఉన్నది ప్రజ్ఞగాబట్టి విద్య స్వస్వరూప పరిశీలననూ ప్రోత్సహింప వలసిందే!

## సృజనాత్మకత (Creativity)

సాధారణంగా చిత్రలేఖనం, సాహిత్యం, శిల్పం యిత్యాదివాటిని, సాంకేతిక యంత్రాలను మానవుడు తన సృష్టిగా పరిగణిస్తాడు. వాస్తవంలో కళాకారులు గాని సాంకేతిక శాస్త్రజ్ఞులు గాని వీటన్నింటినీ రూపొందించటానికి తాముకూడ బెట్టుకున్న జ్ఞానంమీద ఆధారపడక తప్పదు. కనిపెట్టుట (invention) యన్నది తన ఆలోచనపైన ఆధారపడి ఉంటుంది. సృజనాత్మకత ఉండేది కేవలమొక వృత్తిపని చేసేవానికో, నిపుణునికో, కళా ప్రవృత్తిగల వానికో మాత్రమే గాదు! అందరికీ ఉంటుంది. దేనినైనా కనుక్కోవటం సృజించటానికా రంభం. ఏదో కనుగొనాలని ఎంతగానో ఆలోచించే మనిషికి గూడ కేవలం ఆలోచనల్లోనే మునిగి ఉన్నప్పుడు గాక తననుతాను మరచినప్పుడే కనుగొనటం జరుగుతుంది. అక్షణంలో కలిగే ప్రజ్ఞా ప్రకాశంలో ఒక క్రొత్త విషయం చటుక్కున స్ఫురిస్తుంది. సృజించటం కేవలం ప్రేమతో గూడిన గాఢమైన ఆవేదనలో ఒక తపనలో మొలకెత్తుతుంది గాని ఆలోచనలో గాదంటారు కృష్ణమూర్తి.

మనిషి తానొక మొక్కను నాటినప్పుడు, బరువులు మోసే వానిని చూసి చిరునవ్వు నవ్వగలిగినప్పుడు, దారికడ్డమొచ్చిన రాతిని తొలగించినప్పుడు, దారితప్పిన జంతువును దారిలోకి మళ్ళించినప్పుడు, దయగా నున్నప్పుడు గొప్ప ప్రయత్నానికి చిన్న ఆరంభ మవుతుంది. ఏమీ ఆశించకుండా శ్రద్ధ గన్పరచినప్పుడే అది కరుణాపూరితమైన సంబంధాలను పెంచుతుంది. ఆ ప్రేమలో ఆనందపూరితమైన ఆవేదనలో సృష్టి జరుగుతుంది. తన భావోద్వేగాలను, ఆలోచనా నిర్వహణను, తన శరీరాన్ని సూటిగా, నిష్పక్షపాతంగా శాస్త్రీయ దృక్పథంతో అర్థం జేసుకోలేని మనిషికి సృజనాత్మకమైన మనసుండటం అసాధ్యం.

మనసు శాస్త్రీయంగా, ధార్మికంగా నున్నప్పుడు, ఆలోచనల కదలిక గురించిన పూర్తి ఎరుకతో నున్నప్పుడు వాస్తవికతలో స్వేచ్ఛగానూ సున్నితంగానూ ఉన్నప్పుడు

స్వచ్ఛమైన పుష్పంలాగా ఉంటుంది. ఆ స్వచ్ఛమైన నూతన క్షణాలలో మనిషి నూతనానందాన్ని పొందుతాడు. సాధారణంగా మనిషికి బహిర్గత అంతర్గత భయాలెన్నో ఉంటాయి. అవి మనసును స్వేచ్ఛగా ఉండనీయవు. భయం ఒక సాంఘిక నీతిలాగా, సంఘర్షణలాగా, నమ్మకంలాగా, సాంఘిక విలువలాగా బయట పడుతుంది. భయం జీవితాన్ని సూటిగా చూడనీయక ఆటంక పరుస్తుంది. మర్యాద చూపటం ఆ భయానికొక వ్యక్తీకరణ. మర్యాదస్థులు, నీతిపరులు జీవితపు ప్రాధాన్యతను తెలుసుకోలేరు. వారేర్పరచుకున్న గోడలకు ఆవలనున్న దానినీ చూడలేరు.

భయంతో భద్రత నాశించే మనిషి ఇతరులను అనుకరిస్తాడు. అధికారానికి లొంగుతాడు. నిబద్ధతలో చిక్కుకున్నందువలన వాస్తవాన్ని చూసే స్వేచ్ఛ ఉండదు. తన ఆలోచనను జాగ్రత్తగా అమర్చుతాడు. పదాలను ఖచ్చితంగా వాడతాడు. దయతో ఉండటానికి ప్రయత్నిస్తాడు. కానీ జీవితంలో సృజించే ఆనందాన్ని కోల్పోతాడు. సంఘర్షణకు కారణమూ ఫలితమూ ఆలోచనే. ఆ సంఘర్షణలో ఎంతో శక్తి వ్యయ మవుతుంది. గనుక సంఘర్షణకు లోనయిన మనసుకు పూర్తి శక్తి సున్నితత్వం ఉండవు. ఆలోచనలు అంతమయిన క్షణాల్లో పూర్తి శక్తితో నున్న మనిషి సంపూర్ణమైన దానిని గ్రహించటానికెంతో సునిశిత మవుతాడు.

సృజింపగల మనసు నిత్యజీవితంలో ఎదురయ్యే భంగపాటును, అసూయను అణగద్రొక్కక నేరుగా చూస్తుంది. ఫలితాల నాశింపదు. చేతనలోని విషయాలను ఖాళీ చేస్తుంది. ఏ విధమైనా ఎంపికా చేయకుండా పూర్తి ధ్యానంతో యదార్థాన్ని గ్రహిస్తుంది. వికసించిన ప్రతి ఒక్కటీ పూర్తిగా అంతమయినప్పుడు మరొకటి సృజింపబడుతుంది. సంపూర్ణ మానసిక స్వేచ్ఛ అంటే ఆలోచనలు పూర్తిగా అంతమయినపుడు ఉండే పూర్తి శూన్యతేసృజనకు తగిన భూమికయని, పరిశోధించే వారిలో, సృజించే వారిలో అమాయకదృష్టి ఉంటుందనీ అది మానసిక స్వేచ్ఛలోనే సాధ్యమని కృష్ణమూర్తి అంటారు. పూర్తి అవధానతతో చూసినప్పుడే విషయం తేటతెల్లమవుతుంది. ప్రశ్నించి, పరిశోధించి చొచ్చుకు పోయి చూచినప్పుడు అంతర్దృష్టి గల్గుతుంది. సంబంధాలలో నూతనత్వం చూచినపుడు వినూత్నానందం గల్గుతుంది. సృజించే మనసూ ధార్మికమైన మనసూ వేర్వేరు గాదంటారు వీరు. 'నిన్ను నీవు తెలుసుకోకుండా ధార్మికమైన మనసుండదు. నీవు ఖచ్చితమైన తేటయైన నిష్పాక్షికమైన శాస్త్రదృక్పథంతో నున్నప్పుడు ఏ రకమైన దూషణ భూషణలు చేయనప్పుడు కేవలం పరిశీలించే దృక్పథమే ఉన్నప్పుడు నీవు కరుణగల్గిన మనిషివి."

# ప్రేమ (Love)

ప్రేమంటే ఏమిటో మాటల్లో వ్యక్తీకరింపలేము. అదెంత సూక్ష్మమైనదో వేరొకరికి నేర్పలేము. దీనినొక జ్ఞానం లాగానూ అందించలేము. ఏవిధమైన వర్ణనతో గాని సిద్ధాంతంతోగాని ప్రేమనైజాన్ని తెలియజేయట మసాధ్యం. దీని ననుకరింపలేము. అందుకే కృష్ణమూర్తి ప్రేమంటే ఏమిటో తెలుసుకోవాలంటే ఏది ప్రేమగాదో తెలుసుకోమంటారు. ప్రేమ శబ్దంగాదు. అన్ని శబ్దాలు ఆగిపోయినపుడు ప్రేమ ఉంటుంది. అసహ్యత, పేరాశ, వ్యతిరేకత, దోపిడీ, స్వార్థం లేనప్పుడు పూర్తి స్వేచ్ఛలో ప్రేమ పుడుతుంది. ప్రేమ అసూయకు వ్యతిరేకి గాదు. ఒక ఉద్వేగంగాదు. మోహమూ గాదు. ఆధారపడటం గానీ తన స్వంతం జేసుకోవటం గానీ గాదు. దురాశపడటమూ గాదు. ఇవన్నీ స్వార్థానికి వ్యక్తీకరణలే ! స్వార్థం లేనపుడే ప్రేమ ఉంటుంది. సంఘర్షణ వత్తిడి, మూర్ఖత్వాలకు ఆధారమైన విభజన చేసేదేది ప్రేమ గాదు. ప్రేమ కోసం పోటీ పడుతున్నప్పుడు ప్రేమించాలన్న ఆశయం, ఆశాఉన్నపుడు ప్రేమ ఉండదు. ప్రేమను బలవంతంగా ప్రయత్నపూర్వకంగా అలవరచుకోవాలన్న మనిషి హింసాత్మకంగా ఉంటాడు.

ప్రేమించే మనిషి తనకు తోచినట్లు తానుచేయడు. ఇదొక పనిగాదు. త్యాగమూ గాదు. ప్రేమలో ఒక బాధ్యత ఉన్నది. మనిషి తన జీవితాన్ని గురించి యోచిస్తూ తన సంతోషంలోనే మునిగిపోయి వాత్సల్యానికున్న గొప్పసౌందర్యాన్ని అశ్రద్ధ జేస్తున్నాడు. బీదవాడు తన కనీస భౌతికావసరాలు తీర్చుకోవటానికి పోటీపడవలసి వస్తున్నది. ఉన్నది నిలబెట్టుకోవటానికి, మరింత అర్జించుకునేందుకు ఆరాటపడు తుంటాడు ధనికుడు. స్వార్థంతో ఆలోచించే మనిషి కొంతవరకూ, కొందరి పట్ల మాత్రమే దయతో శ్రద్ధతో ఉంటాడు గాని ప్రపంచాన్నే తనదిగా భావించలేడు.

మానవదేహం చురుగ్గా సహజమైన సున్నితత్వంతో నున్నప్పుడు, పూర్తి శక్తితో వ్యక్తమవగలిగినపుడు, మనసు ఏ రకమైన ఆలోచనలతోనూ కలుషితం గానపుడు ప్రేమ జనిస్తుంది. ఉన్నతంగా ఉండటంలోనూ, అవగాహనలోనూ, ఆశయాలు పేరాశలూ లేని శ్రద్ధలోనూ ప్రేమ వ్యక్తమవుతుంది. ఆ ప్రేమ సంతోషకరమైన సమాజాన్ని తయారుచేస్తుంది. అట్టి సమాజంలోనే లోతైన, విశేషమైన, శక్తివంతమైన మంచి సంబంధాలతో గూడిన గొప్ప కళాత్మక జీవితముంటుంది. ఇతరులచేత ప్రభావితమవక తనకు తాను ఆలోచించుకోవటంలో ప్రేమ ఉంటుంది. ప్రేమ ఒక్కటే యితరులను

అర్థం జేసుకోగలదు. ప్రేమ ఉంటే తప్పులుండవు. ఉన్నా ఆతప్పులను ఏనటనా లేకుండా వెంటనే దిద్దుకోవచ్చు. సంతోషప్రదమైన సమాజాన్ని యదార్థంగా స్థాపించటం సాధ్యమయ్యేది ప్రేమకే. స్థాయీ భేదం లేకుండా అందరిని సమానదృష్టితో చూచే శ్రద్ధ ప్రేమలోనే ఉంటుంది. మనిషి తనకు తటస్థపడిన ప్రతి ఒక్కరి పట్లా బాధ్యత వహించి వాత్సల్యాన్ని దయను సహాయాన్ని అందించటమే ప్రేమగా జీవించటం.

మనిషి స్వహస్తాలతో చేసే తోటపనిలో, చెక్కపనిలో, చిత్రలేఖనంలో, మనిషి పెంచుకున్న బీదరికాన్ని, చెట్లను పర్వతాలను మరెన్నో పుడమి సౌభాగ్యాలను చూడటంలోను, సంగీతం నేర్చుకోవటంలోనూ, పక్షుల పాటలలోను, పారుతున్న నీటి సందడిలోనూ ప్రేమ తన విలువను వ్యక్తం చేస్తుంది. ప్రేమించే మనిషికి కోరికల అధికృత తక్కువ గనుక సున్నితంగా సహృదయంతో వాత్సల్యంతో ఉన్నతంగా ఉంటాడు. తనను తాను తెలుసుకున్నందు వలన గలిగిన విశిష్టమైన మార్పుతో, శాంతి సంతోషాలతో ఉంటాడు. సున్నితమైన ప్రేమ పుష్పసౌరభం వంటిది. దానినెందరైనా ఆఘ్రాణింపవచ్చు. కావలసింది సువాసన గాని అదిదేనికి సంబంధించినదోనన్నది గాదు. జీవితంలో ముఖ్యమైనదాన్ని ప్రేమలోనే, అందలి స్వేచ్ఛలోనే గ్రహించవచ్చు. ఆలోచనకు మించిన దానితో సంబంధమేర్పరచుకోవచ్చు. సరైన విద్యాలక్ష్యం అలాంటి ప్రేమను నిత్యజీవితంలోనికి తెచ్చుకోవటమే నంటారు కృష్ణమూర్తి.

తగినంత నైపుణ్యత, అభిరుచి, వాత్సల్యం, ఓర్పు, చురుకుదనం ఉన్న ఉపాధ్యాయుడు విద్యార్థుల సామర్థ్యాలను, భావావేశాలను వారి కష్టాలను, తల్లి దండ్రుల ప్రభావాన్ని పరికిస్తుంటాడు. ప్రకృతి పట్ల, పశువులు, మనుషుల పట్ల ఉపాధ్యాయునికి దయ ఉన్నపుడు అతని ప్రవర్తనలో మాటతీరులో అది ప్రతిఫలించినపుడు విద్యార్థులు గూడా సహజంగా అవి నేర్చుకుంటారు. వాళ్ళు ఆయనను ప్రేమించుటయే గాక ఇతరులను గూడా ప్రేమించటం నేర్చుకుంటారు.

కృష్ణమూర్తి ప్రేమ గురించి ఇలా అంటారు. - "పిల్లలూ మీ మనసుల నుండి ప్రేమను పోగొట్టుకుంటే మనసు కఠినమయిపోతుంది. ప్రేమన్నది నాశనం గానీయక ఎప్పటికీ పదిలం జేసుకోవలసినంత అరుదైనది. వాత్సల్యమంటే చేసే పనిపట్ల మిక్కిలి శ్రద్ధ వహించటమే! ఆశ్రద్ధ నీమాటలలో, వస్త్రధారణలో, తినేవిధానంలో, నీ శరీరపోషణలో

బీద గొప్ప అన్న తేడా లేని ప్రవర్తనలో, మనుషులపట్ల నీకున్న దృష్టిలో ఉంటుంది. మర్యాద అంటే నీకు ఇతరులపై నున్న శ్రద్ధ నీకటువంటి శ్రద్ధ ఉన్నపుడు నీనుండి హింసాప్రవృత్తి దూరమవుతుంది. నీ కోపం, ధైర్యం, గర్వం దూరమవుతాయి. నీలో వాత్సల్యమున్నప్పుడు నీవు పవిత్రంగా పనిచేయగలవు. ఇవన్నీ నీకు కష్టమన్పించు తాయేమో గాని కష్టం గాదు. ఈ రకమైన జీవితాన్ని మనం అశ్రద్ధజేశాం. దైనిక జీవితంలో మన సంతోషంకోసం చేసే ప్రయత్నాల్లో, మన ప్రాముఖ్యతను పెంచుకోవటంలో వాత్సల్యానికున్న గొప్ప సౌందర్యాన్ని అశ్రద్ధజేశాం."

ఎక్కువ మంది తల్లి తండ్రులు వారి సంఘర్షణల్లో విచారంలో వారి వ్యక్తిగత బాధల్లో మునిగిపోయి వారికే తెలియకుండా వారిపిల్లల్లో గూడా వీటన్నింటినీ ప్రవేశపెడతారు. కొందరు తల్లిదండ్రులు వారి ఆశలను, ఆశయాలను పిల్లలపై రుద్ది ఆందోళన కలిస్తారు. పిల్లల విషయాల్లో పెద్దలు నిర్ణయాలు తీసుకొని పోటీకి నిలబడమని ఒత్తిడి జేస్తారు. వారి నుండి సమర్ధవంతమైన మేలు రకపు జీవితాన్ని బలవంతంగా ఆశిస్తారు. అణచివేయబడి బలవంతపెట్టబడిన పిల్లలు హింసాత్మకభావాలను, సంఘర్షణను పెంచుకుంటారు. తత్ఫలితంగా వారిలో సున్నితత్వం బండబారిపోతుంది.

సాధారణంగా తల్లి దండ్రులు వారి పిల్లల్ని ప్రేమిస్తున్నారని మనమంతా నమ్ముతాం. మనకున్న యీ నమ్మకానికి విరుద్ధంగా తల్లిదండ్రులు వారి పిల్లలను ప్రేమించటం లేదంటారు కృష్ణమూర్తి.

ప్రేమించే తల్లిదండ్రులు వారి పిల్లల పోకడలను, స్థితిగతులను, ప్రత్యేకతను పరిశీలించి వారి సంపూర్ణవికాసం పట్ల అభిరుచిని చూపుతారు. కేవలం జ్ఞాన సంపాదనకు, మార్కులు గ్రేడుల సంపాదనకు పిల్లలను ప్రోత్సహిస్తూ. బెదిరిస్తూ ఉండరు. నైతిక సామాజిక పతనాన్ని నిర్లక్ష్యం జేయరు. పట్టించుకొని సరైనవిలువలను వారిలో పెంపొందింప జూస్తారు. పిల్లలను ప్రేమించే ఉపాధ్యాయులు మాత్రమే పిల్లల భయాలను, బలహీనతలను, నిబద్ధతలను ఎలా పెంచుకుంటున్నారో గ్రహిస్తారు. తల్లిదండ్రులు, సమాజము పిల్లలపైన తమఅభిప్రాయాలనెలా రుద్దుతున్నారో, నిర్ణయాలనెలా తీసుకుంటున్నారో గ్రహిస్తారు. తల్లిదండ్రుల ప్రేమను ఉపాధ్యాయుల ప్రేమను అందుకునే పిల్లలకు నేర్చుకోవడం, జీవించటం ఎంతో ఆసక్తిదాయకంగా ఉంటుంది.

## సమగ్రత (Integrity)

శరీరము, మనసు, హృదయాల పూర్తి సమన్వయమెప్పుడుంటుందో అప్పుడే సమగ్రత సాధ్యమంటారు కృష్ణమూర్తి. శరీరం బలవంతంగా శిక్షింపబడనప్పుడు మనసు క్రమశిక్షణకు లోనుగానప్పుడు మాత్రమే సమన్వయం సాధ్యమవుతుంది. ధూమపానం, మద్యం, మత్తుమందుల వంటి ప్రేరణలకు ఇష్టపడే మనసు బలవంతంగా వాటికి నియంత్రింపబడుతున్నది. విపరీతంగా తినటానికి, సోమరితనానికి, మందులకు అలవాటైన శరీరానికి సహజంగా ఉండే ప్రజ్ఞ ఉండదు.

శరీరం జీవంతో చురుకుదనంతో నున్నప్పుడు, తేలికగా ఉద్వేగాలకు లోనుగానట్టి హృదయమున్నప్పుడు, సంపూర్ణమైన లోతైన విలువ గల్గిన మనసున్నప్పుడు అది సువిశాలమైన దయతో అనంతమైన ప్రేమతో సమగ్రమవుతుంది. మనిషి తన పూర్ణ స్వభావాన్నర్థం చేసుకున్నప్పుడు, జీవితపు ప్రారంభాన్ని ఆదరణీయతను అర్థం చేసుకున్నప్పుడు మనసుకు నిశ్శబ్దత అలవడుతుంది. మనసునిశ్శబ్దమైనప్పుడు ఆ నిశ్చలతలో సమగ్రత ఉంటుంది.

## సహృదయత (Goodness)

సహృదయత్ంటే ఏరకమైన నటనా లేకుండా విస్పష్టంగా వుండటం. చెప్పేదానిలోను చేసేదానిలోనూ సవ్యంగా ఉండటం. సహృదయత లేని మనిషే సామూహికమనీ వ్యక్తి పరమనీ విభజిస్తాడు. ఒక సమూహాన్ని ఎన్నో సమూహాలుగా విభజిస్తుంటాడు. 'నీది' 'నాది' అన్న భావన పెంచుతాడు. 'మంచిప్రవర్తన' అంటే 'నాది' అనేది లేకపోవటం, దయతో నెమ్మదితనంతో ప్రవర్తించటం. 'విభజన లేనప్పుడే సహృదయత ఉంటుంది' అంటారు కృష్ణమూర్తి.

"మంచి అంటే చెడుకు వ్యతిరేకమైంది గాదు. చెడు నుండే మంచి పుట్టినట్లయితే మంచిలో గూడా చెడు యొక్క అంశఉంటుంది" అంటారు. మనిషి తన చెడు ఆలోచనలను అసహ్యించుకుంటాడు. అలా అసహ్యించుకోమనో వద్దనో చెప్పే ఇతరుల సలహాలకు బానిసయి సంఘర్షణకు లోనవుతుంటాడు. ఇక్కడ అసహ్యించుకోవటం యదార్థమైంది. అసహ్యించుకోగూడదనేది ఒక ఆదర్శం. ఒక ఆలోచన, అందువల్లనే అసహ్యించుకోవటానికి అసహ్యించుకోకుండా ఉండాలను కోవటానికి ఎడతెరపి లేని సంఘర్షణ జరుగుతుంది. ఆ సంఘర్షణ నుండి మంచి పుట్టదు. తన చెడు ఆలోచనలపై

దృష్టి సారించి నిర్ద్వంద్వ స్థితిలో పరిశీలించినప్పుడు వాటి పరిమితులను గ్రహించినప్పుడు అవి అంతమవుతాయి. అప్పుడు స్వేచ్ఛలో మంచితనముంటుంది.

"బాహ్యంగానే గాక అంతరంగికంగా కూడా స్వేచ్ఛాపూరితమైన పూర్తి సక్రమతలోనే సహృదయముంటుంది. అపక్రమముంటే అది గందరగోళానికి నాశనానికి నియంతృత్వానికి చెడుకు దారి తీస్తుంది. అందుకే యీ సహృదయతను ప్రతిరోజూ ఇల్లు శుభ్రపరుచుకున్నట్లు నిత్యమూ స్వచ్ఛంగా ఉంచుకోవాలి. 'జ్ఞానమే (Knowledge) ఉన్నతమున్న వాదనలోని అసత్యాన్ని సహృదయమున్న మనిషి మాత్రమే చూడగలడు. సహృదయుడు అనుభవజ్ఞుల ముందు తలవంచడు. వత్తిడి, బలాత్కారం సహృదయాన్ని వికసింపనీయవు. సహృదయమంటే 'నాకు' అన్న స్వార్థమేదీ లేకపోవటం. అది ప్రేమలోనే వికసిస్తుంది. మనిషి మంచి వాడై గొప్పవాడవుతాడు గాని గొప్పవాడై మంచివాడవడు. సహృదయము, ప్రేమ, ప్రజ్ఞ ఉన్నప్పుడు ఏ పనైనా కేవలం తనకోసం మాత్రమే జరుగదు. సామూహిక ప్రయోజనాన్ని అది నెరవేర్చుతుంది అంటారు కృష్ణమూర్తి.

## సౌందర్యం (Beauty)

సౌందర్యం అవగాహనలో భాగం. రూపంరుచి శుభ్రత ప్రవర్తనలో మాత్రమేగాక 'నేను' ను విడనాడిన మనసు యొక్క సరళస్థితి సౌందర్యమయమై ఉంటుంది అంటారు కృష్ణమూర్తి. రూపం, నడకతీరు, మాట్లాడే మాటలు, హావభావాలలోని అందమూ ముఖ్యమే అయినా 'నేను' అనే కేంద్రం లేనపుడు మాత్రమే ఆలోచనను దాటి గొప్ప సౌందర్యాన్ని కనుగొనవచ్చు. సౌందర్యాన్ని నిర్వచించి మాటల్లో వ్యక్తపరచలేము.

మనుషుల పట్ల, వివిధ జంతువులు, చెట్లు, వస్తువుల పట్ల నున్న ప్రేమలో అంతర్గత సౌందర్యమున్నది. ఆ ప్రేమలో మనిషికి అమితమైన దయ, పరిశీలన, ఓర్పు అలవడతాయి. మనిషెప్పుడూ అందమైన దాన్ని కావాలని, వికారమైన దాన్ని వద్దని అంటాడు. ఈ ఎంపికలో సున్నితత్వముండదు. ప్రేమించేమనిషి అందానికి వికారానికి భేదం లేకుండా స్పందిస్తాడు. ఆప్రగాఢత మరొక దానితో పోల్చలేని సుందరతను సృష్టిస్తుంది.

చెట్ల అందాలను చూసినపుడు, పిల్లలు చేస్తున్న శబ్దాలను విన్నప్పుడు ఒకింత స్వార్థాన్నుండి స్వేచ్ఛ నొందుతాం. ప్రకృతి పరిశీలనలో అందమైన పరిసరాలలో స్వేచ్ఛ

సౌందర్యం ఉంటాయి. సౌందర్యదృష్టంటే ఎట్టి అభిప్రాయమూ లేకుండా సూటిగా అందాన్ని చూడటం. మనస్సు నిశ్చలంగా ఉన్నప్పుడే ఆదృష్టి సాధ్యం. మనిషెంత సున్నితంగా, స్వేచ్ఛగా ప్రేమగా ఉంటే జీవితంలో అంత సౌందర్యాన్ని చూడగలడు.

## సత్యం (Truth)

మనిషికున్న అభిప్రాయాలు గాని, దృష్టి గాని సంపూర్ణమైనవి గావు, విభాగాలే! అట్టి పాక్షిక దృష్టితో నున్న మనిషి సత్యాన్ని తన ఆలోచనలతో కనుగొనలేడు. సత్యాన్ని కనుగొనాలంటే ముందు అంతర్గత పరిశోధనజేయాలి. అంత:పరిశీలనలో మనసు ఏ విధంగా వాస్తవానికి దూరమవుతున్నదో పరుల ఆశయాలపైన నమ్మకాలపైన అనుభవాలపైన ఎలా ఆధారపడుతున్నదో, దైవాన్ని గురించి స్వర్గాన్ని గురించి ఊహలనెట్లు తయారు చేస్తున్నదో, ప్రత్యక్షజ్ఞానాన్నెలా నిరోధిస్తుందో తెలుస్తుంది. ఈ విధంగా అంతరంగంలో ఒకవాస్తవాన్నుండి మరొక వాస్తవానికి కదలిపోతున్నప్పుడు తెలిసిన దానితో తెలియని దానిని చేరుకోవటము ఎంత అసాధ్యమో తెలుస్తుంది.

కృష్ణమూర్తి సత్యానికొక నిర్దిష్టమార్గంలేదని, మానసిక నిబద్ధత నుండి స్వేచ్ఛనొంది నప్పుడు అంటే ఆలోచన అంతమయినప్పుడు ప్రతిక్షణమూ వాస్తవాన్ని సంపూర్ణంగా గ్రహించటమూ సాధ్యమవుతుందని, ఎవరికి వారే ఆ స్వేచ్ఛలో సత్యాన్ని సాక్షాత్కరింప జేసుకోవాలనీ, సత్యసాక్షాత్కారంలో గురువులేమీ చేయలేరని చెప్తారు. ఆ స్వేచ్ఛలో అనంతమైన శూన్యముంటుంది. ఆ శూన్యతలో శబ్దాని కందనిది ఉంటుంది. అదే పవిత్రమయింది, వెలుగూ, దైవమూ, పేరు లేనిదీ నంటారు కృష్ణమూర్తి.

పూర్తి స్వేచ్ఛలో మెదడు కణాలలో పరిణామం జరుగుతుందని, ఆ మార్పు ఒక్కసారిగా జరుగుతుందని అప్పుడు మనసుకు మెదడుకు భేదముండదని అంటారు. ధార్మికమైన మనస్సున్నప్పుడు సత్యాన్ని కనుగొనటానికి తలుపు తెరవబడుతుంది. అప్పుడు పదార్థానికి ఆవలనున్న పూర్తి సత్యాన్ని దర్శించటానికి మనిషి సన్నద్ధుడవు తాడంటారు.

# అనువాద శబ్దాలు

Acceptance - అంగీకారము, సుముఖత.

Actual - యదార్థత

Accumulation - ప్రోగవుట

Ambition - ఆశ, ఆకాంక్ష

Analysis - విశ్లేషణ

Attachment - చేరువగుట, సన్నిహితమగుట, దగ్గరగుట, బంధం

Attention - అవధానము ధ్యాస, సావధానశీలత

Attitudes - వైఖరులు

Authority - అధికారం, అధికృత, ఆధిపత్యము

Awareness - ఎరుక

Beauty - సౌందర్యం

Belief - నమ్మకము.

Brain - మెదడు, మస్తిష్కము

Burden of the past - భూతకాలపు బరువు

Chattering - గోల, రొద

Comparision - పోల్చుట

Compassion - కరుణ

Competition - పోటీ

Concentration - ఏకాగ్రత

Conditioning - నిబద్ధించుట

Conflict - సంఘర్షణ

Consciousness - చేతన

Content - విషయ సామగ్రి

Creativity - సృజనాత్మకత

Cruelty - క్రూరత

Curiosity - కుతూహలత

Death - మృత్యువు, మరణము, చావు

Defense Mechanisms - రక్షణయంత్రాంగములు

Discipline - శిక్షణ, క్రమశిక్షణ

Discontent - ఆవేదన, అసంతుష్టి

Ego - అహం

Energy - శక్తి

Enquiry - విచారణ, పరిశోధన

Evaluation - మూల్యాంకనము, విలువ కట్టడము

Flowering - వికసించుట

Frame - మూస (పోసినట్లుగా), చట్రం

Heart - హృదయము

Hope of the future - భవిష్యత్తు పై ఆశ

I - నేను

Identification - తాదాత్మ్యము

Images - ఊహా ప్రతిరూపాలు, ఉహాప్రతిమలు, మనోబింబం, కాల్పనిక రూపం

Imagination - కల్పితము, ఊహ

Inattention - అవధానత లేకపోవటము, ధ్యాసలేమి, పరధ్యానము, శ్రద్ధలేమి

Inner motivation - అంతర్గత ప్రేరణ

Intellect - బుద్ధి

Integration - సమగ్రత, సమన్వయము

Intelligence - ప్రజ్ఞ, తెలివి

Insight - అంతర్దృష్టి

Isolation - ఒంటరితనం

Knowledge - జ్ఞానము

Learning - అభ్యసన, నేర్చుకోవటము.

Listening- వినుట

Love - ప్రేమ, వాత్సల్యము

Meditation - ధ్యానము.

Memory - స్మృతి, జ్ఞాపకము

Mind - మనసు

Motivation - ప్రేరణ.

Mutation - పూర్తి మార్పు, ఉత్పరివర్తనము

Neural activity - నాడీ సంబంధ ప్రక్రియ

Nondual - నిర్ద్వంద్వ

Obedience - నమ్రత

Observation - పరిశీలన.

Observed - పరిశీలింపబడునది.

Observer - పరిశీలించువాడు

Opposites - వైరుధ్యాలు, ద్వంద్వాలు

Order - సక్రమత, క్రమశీలత్వం

Perception - ప్రత్యక్షజ్ఞానము

Perception of what is - స్వచ్ఛమైన దృష్టి

Pressure - వత్తిడి

Psychological death - మానసిక మరణము

Psychological Freedom - మానసిక స్వేచ్ఛ

Psychological Time - మానసిక కాలము

Reality - వాస్తవము

Reason - వివేచన, హేతువు

Recording - ముద్రించుట

Rejection - అంగీకరించకపోవుట, విముఖత, త్రోసివేయడం, నిరసించడం

Relationship - పరస్పర సంబంధము, సంబంధబాంధవ్యము

Religious Mind - ధార్మికమైన మనసు

Respectable People - మర్యాదస్తులు, నీతిమంతులు

Security - భద్రత, రక్షణ

Self - నేను

Self-Knowledge - స్వ స్వరూపజ్ఞానము, స్వీయ జ్ఞానము

Self observation - ఆత్మపరిశీలన, స్వీయపరిశీలన

Sensitivity - సున్నితత్వము, కోమలత

Sorrow - దుఃఖము

Time - కాలము

Total - సంపూర్ణము, సమస్త

Total development - సంపూర్ణ వికాసము

Total Perception - సంపూర్ణ గ్రాహ్యత

Unconscious - అంతశ్చేతన, అంతర్గత చేతన

Values - విలువలు

Violence - హింస

Wisdom - వివేకము